# భారతి — షష్ఠసంపుటము — భా. ౧.

## వ్యాసకర్తల అకారాదిసూచిక

స

| | | | సంచిక | పు |
|---|---|---|---|---|
| శేషాద్రిరమణకవులు—దమయంతీసంవరణము (నా) | ... | ... | ౨ | ౧౮౯_౧ |
| ,, రుద్రదేవుని అనుమకొండశాసనము(చ) | ... | ... | ౪ | ౫౩౧_౫ |
| శ్రీనివాసరావు, శ్రీ.—అంతిస్సమాధి (ప) | ... | ... | ౨ | ౨ |
| ,, ,, నిశీథసాంత్వనము (ప) | ... | ... | ౩ | ౩ |
| ,, ,, తపస్విని (ప) | ... | ... | ౫ | ౬ |
| ,, ,, మధుమూర్తి (ప) | ... | ... | ౬ | ౭ |
| శ్రీరంగనాయకమ్మ, వాడ్రేవు—వైరాగ్యోదయము (ప) | ... | ... | ౪ | ౫౨౭_౫ |
| శ్రీరామశాస్త్రి, గొల్లపూడి—బ్రహ్మచర్యము | ... | ... | ౨ | ౨౫౯_౨ |
| శ్రీరాములుచౌదరి, జాస్తి—కర్షకా! (ప) | ... | ... | ౩ | ౩ |
| ,, యేలెళ్ల—పశువు-దేహనిర్మాణము | ... | ... | ౫ | ౮౨౭_౮ |
| శ్రీరాములురెడ్డి, పూతలపట్టు—విద్యమాన విద్యావిధానము | ... | ... | ౬ | ౭౩౭_౭ |
| సత్యనారాయణ, కొత్త—త్రిలింగలక్షణశేషము-తెన్నామవిచారణము | ... | ... | ౧ | ౧౬_ |
| ,, విశ్వనాథ—సాయివేణువు (ప) | ... | ... | ౨ | ౧౪ |
| ,, ,, మూగనోము (ప) | ... | ... | ౩ | ౨౯౫_౨ |
| సత్యనారాయణరాజు, పెనుమెచ్చ—కమ్మరీడు (ప) | ... | ... | ౨ | ౨౦౩_౨ |
| సర్వేశ్వరశాస్త్రి, పారనంది—అధ్యాత్మ వాల్మీకి రామాయణములందలి కథాభేదములు | | | ౬ | ౮౫౫_౮ |
| సాంబయ్య, మద్దూరి—రాధికావిరహము (ప) | ... | ... | ౨ | ౨౩ |
| ,, ,, రామస్తవము (ప) | ... | ... | ౩ | ౪౧౮_౪ |
| సాంబశివరావు, దిగుమర్తి—తేలు | ... | ... | ౪ | ౫౪౪_౫ |
| సాంబాత్రి మహాముని, కల్లూరి—పెంపుడుగున్నలు | ... | ... | ౬ | ౮౯౮_౭౦ |
| సీతారామమూర్తిచౌదరి, తుమ్మల—ఆత్మార్పణము (ప) | ... | ... | ౧ | ౧౦_౧ |
| సుబ్బారాయుడు, కడాది—మల్లి కొమారుతిము (ప) | ... | ... | ౩ | ౩౧౭_౩ |
| ,, ,, ,, | ... | ... | ౪ | ౪౭౩_౪౭ |
| ,, ,, ,, | ... | ... | ౫ | ౮౧౪_౮౧ |
| సుబ్బారావు, వేలాల—లీలారంగం (క) | ... | ... | ౬ | ౭౧౫_౭౩ |
| సుబ్రహ్మణ్యము, బి—మైసూరుకళాపరిశ్రమలు | .. | ... | ౧ | ౧౦౮_౧౧ |
| ,, ,, మైసూరునందు పట్టుపరిశ్రమ | ... | ... | ౨ | ౨౪౩_౨౪ |
| ,, ,, మైసూరు పురాతనశిల్పకళ | ... | ... | ౫ | ౮౨౫_౮౨ |
| సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీపాద—అత్త-అల్లుడు (ప) | ... | ... | ౧ | ౧౧౧_౧౧ |
| ,, రాచపీనుగు తోడులేకుండా వెళ్లదు (క) | ... | | ౬ | ౮౭౯_౮౯ |
| సూర్యనారాయణతీర్థులు, పురాణం—హారుంరసీదు నాశేరవాః (కల) | ... | | ౨ | ౨౮౮_౨౮ |
| ,, ,, శ్రీకృష్ణుని వేణుగానము (ప) | ... | | ౩ | ౪౪ |
| సూర్యనారాయణరావు, వల్లూరి—హైందవసాంఘికపరిణామము | ... | | ౪ | ౫౫౩_౫౫ |
| సూర్యనారాయణశర్మ, పోచంచి—ప్రబోధము (ప) | ... | ... | ౪ | ౫౨ |
| సూర్యనారాయణశాస్త్రి, కుల్లాడి—ఛందోవిశేషములు (విాగడ) | ... | | ౩ | ౩౬౮_౩౬ |
| ,, సన్నిధానము—పంచవన్నెలచిలుక (ప) | ... | | ౫ | ౬ |

# భారతి—షష్ఠసంపుటము—భా. ౧.

## వ్యాసముల అకారాది సూచి

# ర

# చిత్రములు

వర్ణచిత్రములు:—ప్రభాతము; ఆంధ్రబాలిక; నైవేద్యము; ఖమాచ (రాగిణి)

సాధారణచిత్రములు:—శ్రీయుత పండిత మోతీలాలు నెహ్రూగారు, జె. యమ్. గారు; ఆకస్మికఛాయాచిత్రములు 3; పూవుల గడియారము ౪; నాటకపాత్రల 3; మైసూరుకళాపరిశ్రమలు-చిత్రములు ౧౮; వింతవస్తువులు ౪; ఇతరచిత్రములును.

---

# మా చందాదారులకు

భారతి ౫ వ సంపుటము రెండవభాగమునకు సంబంధించిన వ్యాసములయు, వ్యాసకర్తల అకారాది సూచికలు, ముఖపత్రము, రానున్న సంచికతో వెలువడును.

—సంపాదకుడు, భారతి

---

# ప్రశంస

ఖులసు వెంకటరమణయ్యగారు

సీ॥ ..నింపారఁ బ్రసిద్ధ వైజ్ఞానిక
భాసద్విమర్శ సత్ప్రభలనించి,
రమణీయ వర్ణవిరాజిత చిత్రప్ర
ఖమదూపములను సందీప్తినెరపి,
పఠనమాత్రమున సర్వజ్ఞానములనిడి
త్రిగుణతత్త్వంబులఁ దెలియఁబఱచి,
కమనీయ గీతికా కలితరీతి రచించు
క్రమకావ్యములఁ బంకమ్ముఁ బాపి,
గురువులై సర్వ విజ్ఞాన గరిమఁ దెలిపి,
జగతి లాలించు తల్లివై దిగులుఁ బాపి
యనుపమ విమర్శ కాగతఁ గనఁగఁ గథన
మనను మేటివి భారతీ, మాగుదవయ్య.

# సంవత్సర జాతీయ గీతిక

కవికొండల వేంకటరావు గారు

౧

హిమగిరిశిఖరము-వింధ్యవనీంద్రము-కన్యాకుమారీపదశిండీరము
స్ఫురితము-భరితము-చలితోల్లలితము
స్వాతంత్ర్యముచే-స్వాతంత్ర్యముచే
త మనవోయ్, కని, పని వినవోయ్, మనవోయ్ అనవోయ్, జయ్, జయ్, జయ్!

౨

జాహ్నవి, గౌతమి, కృష్ణ, పినాకిని, కావేరి, నర్మద, యమునా సింధులు
అహర్నిశాదులు-ఒకటేగా నము-కలలో-అలలో-అదే ప్రయాణము
స్వాతంత్ర్యముకై-స్వాతంత్ర్యముకై
త మనవోయ్, కని, పని వినవోయ్, మనవోయ్, అనవోయ్, జయ్, జయ్, జయ్!

౩

గుజరాత్, వంగ, అంగ, మరాటా, త్రిలింగ, త్రమిళ, కళింగమును జను
లజరులు-అమరులు-అనామయులుగా
స్వాతంత్ర్యము హేయ్! స్వాతంత్ర్యము హేయ్!
త మనవోయ్, కని, పని వినవోయ్, మనవోయ్, అనవోయ్, జయ్, జయ్, జయ్!

౪

నౌరోజ్ తిలకులు, లజపద్దాసులు, దానిపథంబున, నలిగిన నొగిలిన
వెచ్చని నెత్తుటి దివిటీ వెలుగున
స్వాతంత్ర్యంబదె!-స్వాతంత్ర్యంబదె!
క మనవోయ్, కని, పని వినవోయ్, మనవోయ్, అనవోయ్, జయ్, జయ్, జయ్!

౫

ఇంగ్లం డమెరిక, స్వీడన్, స్విట్జు, జపాను, జర్మని, కీవు, పరాసు,
అంబవిశ్వకళ కభివాదనమిడు
స్వాతంత్ర్యమురా, స్వాతంత్ర్యమురా
మనవోయ్, కని, పని వినవోయ్, మనవోయ్, అనవోయ్, జయ్, జయ్, జయ్!



చెన్నపట్టణము, డిసెంబరు ౧౯౨౮

సంపుటము ౬ విభవ సంవత్సరము పుష్యమాసము సంఖ్య ౧

# స్వవిషయము

ఆనందము జీవబ్రహ్మములకు సహజావస్థ.

సకలజీవములును నిరతిశయానందమును గోరుచు జీవయాత్రను జేయుచున్నవి. ఆనందము జీవజాలమును జీవయాత్రయందు పోషించుచున్నది. ఆనందానుభవమున కనంతములైన సృష్టివిలాసములు ప్రత్యక్షసాధనములుగ నున్నవి. మహానుభావులు సృష్టివిలాసములందానందసందర్శనమును శేయుచులోకానందమునకు సాధనంబుల నుపదేశించుచున్నారు. ఆనందము దివ్యసౌధములందువలె పూరిగుడిసెలందును, కుబేరులందువలె నిరుపేదలందును, పండితులందువలె పామరులందును, నగరములందువలె వనములందును, అంతరిక్షమునందువలె భూమియందును, ధీరులందువలె భీరువులందును, సాధువులందువలె క్రూరులందును మహానుభావులకు ప్రత్యక్షమగుచున్నది. భారతీదేవి కంగోపాంగములైన చతుర్దశవిద్యలు, చతుష్షష్టికళలు, సకలసాహిత్యములు మానవుల కానందదాయకములై విశ్వకల్యాణమునకు సాధనములుగ నున్నవి.

భారతి అనంతములైన విశ్వవిలాసముల కధిదేవత. భారతి—సావిత్రి, సరస్వతి, వరదాయిని, మహాదేవి, కళాస్వరూపిణి, పురుషార్థప్రదాయిని, ఆనందమయి. అనంత భారతీవిలాసములను శాస్త్రజ్ఞులు పరిశోధించుచు జ్ఞానానందము ననుభవించుచున్నారు; కవులు వర్ణించుచు రసానందమును బడయుచున్నారు. గాయకులు పాడుచు నాదానందము ననుభవించుచున్నారు. శిల్పులు చిత్రించుచు రూపానందమును ప్రత్యక్షము చేసికొనుచున్నారు.

న్యులు మహానుభావుల ననుసరించుచు
దించుచున్నారు.

నంతములైన భారతీవిలాసముల కాద్యం
ు లేవు. ఆద్యంతములు లేని భారతీ
స వైభవముల కు నామరూపములను
ది య్యానందమును గలుగజేసెడి మహాను
ు ధన్యులు. అనంతములైన వైభవ
ములతో వెలయుచున్న భారతీదేవినసం
ముల నారాధకు లుపాసించి సేవించుచు
ద్యమును బొందుచున్నారు. భారతీదేవి
రాయణుల కనుకూపమైన ఫలమును
ంచుచున్నది. భారతి ఎవరు సేవించిన
న వారికి ప్రత్యక్షమై ఆనందమును
ంచుచున్నది.

ఖండమైన భారతీవిలాసములం దొక
లాసమును ప్రదర్శించుటకు భారతి
నామరూపములనుదాల్చినది. భారతికి
ండ్లు నిండినవి. ఆరవయేడారంభమైనది.
ను గ్రహమువలనను, ఆంధ్రమహాజనుల
పోషణములవలనను భారతి క్రమవికా
బొందుచు యథాశక్తిని స్వధర్మనిర్వ
ను జేయుచున్నది. భారతి నాదరించి
ముల పోషించుచున్న వారందఱు
సాదమును బడయుచు నిర్వాహకుల
ను స్వీకరింతురుగాత!

రతియందలి గుణదోషములను గ్రహిం
పండితులు సమర్థులు. నిర్వాహకులు
భిమానముతో గుణములను గనుగొను
దోషములను గనుగొనజాలరు.
శోభితమై తాను ఆంధ్రహృదయ
మును ప్రత్యక్షము చేయుటయే భార
జనము. ప్రవృత్తియందు జాతీయా
ు భావౌన్నత్యము మీద నాధారపడి
యున్న విధమును ప్రపంచేతిహాసములు విశ
దము చేయుచున్నవి. భారతి నలంకరించు
చున్న పద్యములు, కథలు, కావ్యవిమర్శనలు,
నాటకములు, పరిశోధనలు, చిత్రములు,
తత్త్వవిచారణలు, వింతలు, విశేషములు ప్రజా
ప్రబోధాయత్తమైన నవజీవనప్రభావమును
విశదము చేయుచున్నవి. ప్రజాహృదయ వికా
సమునకు భావవికాసము మూలబీజముగ
నున్నది. జాతీయభావవికాసము కళాసాహిత్య
రూపములను ప్రత్యక్ష మగుచున్నది. ఆంధ్ర
హృదయస్వభావ మాంధ్రశిల్పమునందును, సం
గీతసాహిత్యములందును, నిత్యజీవనమునందును
ప్రత్యక్షమగుచున్నది. ఆంధ్రశిల్పమునకు గల
వ్యక్తిత్వమును ప్రాచీనమైన అమరావతి, అజం
తా శిల్పములవలె వర్తమాన రామారావు
చిత్రకళయును విశదము చేయుచున్నది.
ఆంధ్ర సంగీత సాహిత్యహృదయమును ప్రాచీ
న కావ్యములవలె వర్తమాన కావ్యములును
విశదము చేయుచున్నవి. ఆంధ్రహృదయ స్వ
రూపము స్త్రీలయందును పురుషులయందును,
బ్రాహ్మణులందును, బ్రాహ్మణేతరులందును,
పండితులందును పామరులందును వికాసమును
బొందుచున్న విధమును కళాసాహిత్యస్వరూ
పములు విశదము చేయుచున్నవి. ఆంధ్ర
సాహిత్య కళాప్రపంచము సర్వతోముఖమైన
వికాసము నభిలషించుచున్నది. ఏతత్ఫలప్రా
ప్తికై భారతియును గతించిన అయిదేండ్ల యం
దును యథాశక్తిని పాటుపడినది. ఇంతవరకును
భారతిని పోషించిన సాహిత్య కళోపాసకులకు
వందనము లర్పించుచు ముందును సహాయము
చేయుటకు వేడుచున్నాము. కావ్యకళావిలాసిని
యై, ఆనందదాయినియై భారతి వర్ధిల్లుటకు పర
మేశ్వరు డనుగ్రహించుగాత!

# దానిని మీకొరకే వినియోగింపుడు

మా మహిళా పోషకులకు

మీరు నిలువచేయగలిగిన స్త్రీధనము— మీ తండ్రి—సోదరుడు—భర్త—పుత్రుడు— వీరిలో నెవరివద్ద మీ రుంచినను సరే, దానిని మీకొరకే వినియోగింపుడు.

ఆ ధనముతో నగలుకొని వానిని మీరు ధరింపుడు.

పురుషు లెల్లప్పుడును......... ఈసంగతి మీకు బాగుగా తెలిసియే యున్నది. కావున మీకు హక్కుగల స్త్రీధనము బాంకిలోను నమ్మకములేని వాటాల క్రిందను నిలువబడి యుండగూడదు.

ఆధనము లెల్లప్పుడును మీకంటి యెదుటనే మీ వంటిమీదనే యుండ వీలగునట్లు, దానితో మీ కొరకు సొగసైన నగలను కొనుడు.

మేము తయారుచేయించిన నగల విలువ యెన్నటికిని తగ్గిపోదు. నగలను అందముగా చేయించుటయే ప్రత్యేకాభిమతము. ఈవిషయమున మేమే అగ్రగణ్యుల మనిగూడ సవినయముగ తెలుపుచున్నాము.

మీరు మొదట మావద్ద కొనునట్టి అలంకారము మీకు మిక్కిలి సంతృప్తికరముగా నుండుటకే మేము ప్రయత్నించెదము. అటు పిమ్మట మీ రెల్లప్పుడును మావద్దనే కొనుచుందురు. మీ మిత్రులకు గూడ సిఫారసు చేయుచుందురు.

## ఉమ్మిడి రామయ్యశెట్టి గురుస్వామిశెట్టి కంపెని,

బంగారు వెండి నగలను తయారుచేయువారు,

25, చైనాబజారు రోడ్డు    చెన్నపురి.    62, గోవిందప్పనాయక వీధి

మూలములై యొప్పినవి. 'కుఱు' అను మూలరూపము నందలి శకటరేఫము ద్విత్వమును బొంది, 'కుఱ్ఱు' అయి శకటరేఫద్విత్వోచ్చారణము టకారరేఫములను గలిపి యుచ్చరించినట్లుండు గావున, కుఱ్ఱు—కుట్ట్రు అయి, రేఫజారిపోయి, 'కుట్టు' అనురూపమున, 'కుట్టుసురు' మొదలగుపదములలో దెనుగున గానవచ్చుచున్నది. 'కుఱు' కుఱుచయైన 'ఊసురు' అన్నపుడు, 'కుఱు', విశేషణ మగుటచే, 'ఉ'కారమునకు ద్విత్వమువచ్చినది. ఒకకాల మున ద్విత్వము లేకుండగూడ విశేషణమైయుండుటయు కలదు. కావుననే కుఱుగద్దియ, కుఱుగలి, కుఱుగేలు, కుఱుమావు మొదలగు పదము లేర్పడినవి. మనయాంధ్ర వైయాకరణులు, నిఘంటుకారులు, ఇది 'కుఱుచ'శబ్దమే యనియు, వృత్తియందు 'కుఱుచ' శబ్దమునకు మీదివర్ణము లోపింపగా, 'కుఱు' అనునది సిద్ధించుననియు దీని కచ్చుపరమైనచో అకారమునకు 'టు'కారద్వయ మాదేశ మగుననియు, నిట్లే కుట్టారుగ, కుట్టుముక, కుట్టుసురు, కుట్టాపిక, మొదలగు పదము, లేర్పడినవనియు జెప్పుదురు. 'చిఱు' మొదలగు శబ్దములలోగూడ నిట్లే ప్రాచీనభాషయందలి శకటరేఫాంతమగుపదము విశేషణమైనపుడా శకటరేఫమునకు ద్విత్వము కలుగుటయు, నాద్విత్వరేఫము 'ఱ్ఱ' ఊదిపలుకబడుటచే 'ట్ట్రి'గా నుచ్చరింపబడుటచేతను, 'శిత్తిలిగళ్' మొదలగు ప్రాచీనసమాసములు తెలుగున 'చిట్టెలుకలు' అనురూపమును బొంది ద్విత్వటకారముతో గూడినవైనవి. ఇది ప్రత్యేకముగా సామవాజకమైనపుడు రేఫోచ్చారణమే నిలచినట్లున్నది. కుఱ్ఱ, కుఱ్ఱడు—చిన్నపిల్లవాడు, పలచన (పలధాతువు), వెచ్చన (వే—ధాతువు) పచ్చన — (పస్ధాతువు). మొదలగువానిలోవలెనే ఈ 'కుఱు' అనుదానికి 'చ' అనునది చేర్పబడుచున్నది. ఇ 'చ' యనున దేపదమునొక్కొ యవశిష్టరూపమో విచారింపవలసియున్నది. సమాసములలో గనబడు 'కుఱు' అనురూపమే 'కుఱుచ' అనుపదముకంటె మిగుల ప్రాచీనమగుటకు సందేహము లేదు; 'కుఱుమట్టము' అనుపదము మఱొకటి కలదు.

✓ 'కుఱుకుఱు'అనగా 'అల్పము'

క. ఎఱసంజ కెంపు విరిసెం
జిఱుచీకటు లెగసి గగనసీమన్ బలసెన్
గుఱుకుఱు తెగలై కనబడి
తెఱచై వెనువెనక పెక్కుతారలు దోచెన్.

సమీపము అనునర్థముగల 'కుఱుంగటు' అను ములోగూడ 'కుఱు' అనురూపము కనబడుచున్న "సమీపముగా జేరిన కొన్నివస్తువుల సమూహము" అన 'రాశి' అనునర్థమున 'కుఱుకు' అనుపదము ప్రాచీనవ హారమున నున్నట్లున్నది. ఇప్పుడు వాడుకలో లేకపో టచే క్రొత్తగా గనబడునుగాని భారతము ద్రోణప ములో

మ. కుఱుకుల్ గట్టె భటాంగకంబులు రణ
క్షోణిం బ్రవాహంబులై
పఱచెన్ నెత్తురు భూతకోటి విహరిం
పన్ బ్రస్తుతింపన్ సురల్

అని యుద్ధభూమిని భటుల యవయవములు వులు గట్టెననుటకు 'కుఱుకుల్' అనుపదము తిక్క ప్రయోగింపబడినది. మనకు క్రొత్తగా గనబడు నిట్టి యోగములు భారతమున నడుగడుగునకు బొడగట్టుచ యుండును.

ఇది యాంధ్రతమిళములయందే కాక కన్నడ నను విశేషప్రచారములో నున్నట్లేయున్నది. 'కు గడ్డ' = చిన్నగడ్డము; కుఱుగిడ = చిన్న చెట్టు, కుఱుద చిన్నకఱ్ఱ, కుఱుగెయ్యి = చిన్న చెయ్యి, కుఱుగణి చిన్నదోయియుండుట, అనుపదములలో గానవచ్చు న్నది. తమిళమున కుఱుగు = చిన్నదగుట, చిన్నదో యను నర్థమున కలదు. దీనికి సంబంధించినదే తెలు 'క్రుంగు' అనుధాతు వేర్పడియుండును, వాడు క్రు పోయినాడు. అది క్రుంగిపోయినది. అనగా పొట్టియైన క్రిందికి దిగిపోయినది, పొడవు అడగినది. అన్నయర్థ వచ్చినది. కావున తెలుగులో 'క్రుంగు' ధాతువు 'కుఱు' అనునదే మూలరూపమని తెలియవచ్చుచున్న కుఱ్ + అగు 'కుఱుగు—కుఱుంగు' అనినదైయుండును.

డభాషలలోగూడ చిన్నదనము, పొట్టితనము
s) అను వర్థమున 'కుఱుచు' 'కుఱచి' అను
లవు తెలుగున కుఱుజా అనియు గలదు.
అనుదానినుండియే, 'గుఱుజా' 'గుజ్జా'—
)అనుపదము లాంధ్రకన్నడముల నేర్పడియుం
గున మఱుగుజ్జా అను పదమునను, బ్రహ్మక
వాడు అను వర్థమునగూడ నీ 'గుజ్జా' పదము
న్నది. నిఘంటువులలో నిది 'కుబ్జ'శబ్దభవం
బడినను, ద్రావిడభాషలన్నిటిలో ననేకము
కు మూలంబైన 'కుఱు' అనుధాతువునుండి,
పదనుటయే సమంజసముగా గనబడుచున్నది.
"గుజ్జుకత్తి" అనగా చిన్నకత్తి (a small
మర—పొట్టిచెట్టు (a small tree). ఆచెట్టు
గుచున్నది అనియు, నందురు. ఇది మళ
"కొజ్జు" అనియు, తుళుభాషలో "గుజ్జు"
—పములతో నున్నది. కన్నడమువందలి
తక్కువతనము అనువర్థము గల 'కొత్త'
eficiency) అనుపద మీ 'కుఱు' ధాతువు
ర్పడినట్లున్నది. కుఱు + త=కుఱుత=కుత్త—
నే యాంధ్రమున 'కొఱత' అనుపద మేర్పడి
'కుఱు' లోని మొదటి కకారముమీద
రము—'ఓ'కారముగా మాఱినది. ఇత్తీమూల
ని—ఉకారొకారములు. ఎ, ఓలుగా మాఱు
అచుగా గా న న గు ను; తమి. కుట్టు=
trike) తె. కొట్టు; తమి. కుడి= point
కొడి(దీపపుకొడి); తమి. కుడుపు=a stick
g drums, తె. కొడుపు; తమి. కుడై—
etc.) కావున, కుఱ్ త—కుత్త, అని కన్న
ప్పడగా తెనుగున 'కుఱు','కొఱు','కొఱత',
పద మేర్పడినది.

కుఱు' 'కొఱు' అను రూపమును తెందు
చికాలమున 'కుఱు'—'కిఱు' అనురూపము
మున్నట్లు కనబడుచున్నది. కిఱి— కిఱ—
—కెఱ—కొఱత—గుజ్జు మొదలగునవ
కే కుటుంబమునకు జెందినవనియే కిట్టెల్

(Kittel) పండితుని యభిప్రాయముగూడ నైయున్నది. ఇందలిక కారము తరువాత నొక ఇకారము వచ్చియుండు టచే నీతాలవ్యాచ్చు, ఆకకారమును తాలవ్య 'చ' కారముగా మార్చివేసినది. ఇట్టి తాలవ్యీకరణము (palatalization) మార్యభాషలలోగాక ద్రావిడభాషలకుగూడ వర్తించుచుండుట సుప్రసిద్ధమే. (Cf— కివి = చెవి, కెంపు = చెన్ను, కెయ్ = చెయ్యి, కిడ= చెట్టు, కిటి=చిలుక ఇత్యాదులు) కావున 'కిఱి', 'చిఱి'— 'చిఱు' అయినది. ఇది యొక్క తెలుగునకేకాక తమిళ మళయాళములగూడ 'చిఱు' అనురూపమును బొందియు న్నది. కాని కన్నడమునను, తుళుభాషనుమాత్రము కిఱి, కిరికిఱు, కిఱ, అనురూపములు కలవు. కన్న. కిఱి కుల, కిఱిగట్టె, కిఱియుక్కు, కిఱుకాల, కిఱుబులి, కిఱుసె, లర్, ఇత్యాదులు 'క' కారముతోగూడినవై ప్రాచీన రూపమనుట నిశ్చయము గావున తులు కన్నడములలో ప్రాచీనరూపములు నిలచియున్నవనియు తెలుగులో నది యంతరించిపోయినవనియు దలంపవగును. 'కొఱె' అను రూపముకూడ కన్నడమున 'కొఱెదిన, కొఱెప్రాణ(the point of death) ఇత్యాదులయందు కలదు.

పైని దెలుపబడిన క్రియారూపము 'కుఱుగు' అను నది ఈ 'కుఱ్' అనుధాతువునుండి యేర్పడినదే యని చెప్పబడిరెంగదా! ఇది యాంధ్రతమిళమళయాళభాష లలో గనబడుచున్నది. ఆంధ్రమునమాత్రము కొంత మార్పు బొందియున్నది. 'కుఱ్' అనునది కేవలవ్యాపారమును సూచించునదిగా లేకుండుటచేతనో ఏమో యీమూలరూపమునే ధాతువుగా గ్రహింపక యాంధ్ర కన్నడభాషావై యాకరణులందఱును 'గు' అంతమందు గల 'కుఱుగు—(లేదా క్రుంగు)' నే ధాతువుగా గ్రహించు చున్నారు. దీనివంటిదే 'పెరు' అనునదొకటికూడ కలదు. 'పెర్' కు 'పేర్' అనురూపముకూడ కలదు. అది పెరుగుచున్నది అనుటకు 'పెరుక్కు—అదు' అని తమి ళమున జెప్పుదురు. ఈ 'పెరుగు', 'పెరుక్కు' లకు కొంత సంబంధముండునని తోచకమానదు. తెలుగులో ననేకధాతువులు 'గు' '(గు' లతోగూడినవై కనబడుచు న్నవి.కలుగు, చెలఁగు, తలఁగు, మలఁగు,వెలుఁగు, తొలఁగు,

తెలుగు, విరుగు, కఱగు, చెలుగు, తిరుగు, తునుగు, పెరుగు మొదలగు వానిలోని 'గు' ధాతుస్వరూపమునకు జెందినదిగానే తలంపబడుచున్నది. ఇట్లొక తెనుగునందే కాదు. కన్నడభాషా వైయాకరణులుగూడ 'గు' అంతమునే ధాతువుగా నెంచియున్నారు. కేశిరాజు శబ్దమణి దర్పణమున 'గు' అంతమందుగల ధాతువుగా నెంచియున్నాడు. కేశిరాజు శబ్దమణిదర్పణమున 'గు' అంతమందు గల ధాతువుల ననేకములను దెలిపియున్నాడు. పోగు—గమనే, అగు—ప్రాదుర్భావే తొలగు—విభక్తే, కరగు—విలీనే, మరగు—గోపనే, మొఱగు—వాదన క్రియాయాం, మిఱుగు—చకచకాయమానే, మిగు—అతిక్రమణే, బిగి—బంధనే—ఇత్యాదులు. ఆంధ్రకన్నడవైయాకరణు లిట్లు 'గు' అంతమునే ధాతువుగా గ్రహించి వీనిపైని 'ఉన్నా' ద్యనుబంధములను వర్తమానాది కాలద్యోతకములుగా జేర్చి క్రియారూపములను నిష్పత్తి చేసినను తమిళవైయాకరణులు మాత్రము యీ 'గు' అంతమును ధాతువుగా బరిగణింపక 'పెర్, పో, ఉళ్, వర్' మొదలగువానినే ధాతువులుగా గ్రహించి, వానిపైని వర్తమానార్థమున 'కిరు', 'గిరు' అనునవి చేర్చబడునని చెప్పుచున్నారు. కిరు—గిరు అనునవి వర్తమానార్థకప్రత్యయములుగా నిటీవలి ద్రావిడభాషావైయాకరణులచే గ్రహింపబడినవి. కాని, యీభాషకు బ్రథమవైయాకరణుడగు తొల్కాప్పియార్' అను నాయన రచించిన 'తొల్కాప్పియం' అను లక్షణగ్రంథమున 'కిరు—గిరు' అనిచెప్పక 'క్రియలకు జేర్చబడు ప్రత్యయములక్రింద కుం, డుం, తుం, ఉం, అనునవి ఉత్తమపురుషబహువచనమునను, కు, డు, తు, ఉ అనునవి ఉత్తమైకవచనమునను వచ్చునని చెప్పి యిచ్చియున్నాడు. దీనినిబట్టి యీ 'గు' అనునది ధాతువుల కేదో యొకయర్థమున తరువాత జేర్చబడిన ప్రత్యయము వంటిదిగాని ధాతువునకు లేదా మూలరూపమునకే చెందినది కాదని స్పష్టమగుచున్నది. ఇంతేకాక ఈ 'గు' లేకుండగనే యనేకపదము లామూలరూపమునుండి బయలు దేరుచున్నప్పుడు, 'గు' అంతము క్రియారూపములకు మూలమన్న ననవచ్చును గాని భాషలో మూలరూపము, (Elemental form) అని చెప్పుట పొసగదు. 'తునుగు' దానినుండి, తునిగినది తునుగుచున్నది. మొదలగుక్రియారూపములనుతునుక, తునుగుట, మొదలగు భావార్థకరూపములను నిష్పన్నంబై యుండవచ్చునుగాని, తుణి, తునియు, తుంకు, తుంపర, మొదలగుపదములలో 'గు'కు ప్రసక్తి లేకపోవుటచే 'తున్' అనునదే ధాతువని తలంపనగునే కాని, 'తునుగు' ధాతువనుట సమంజసముకాదు. ఆపదములలో 'గు' లోపించినదని చెప్పుటలో నర్థమే లేదు. ఆర్యభాషలలోవలె ధాతువు వ్యాపారద్యోతకమైయుండవలెననియు, తునుగు, వెలుగు మొదలగువానినుండియే క్రియారూపములు బయలుదేరుచున్నవిగావున నవియే ధాతువులై యుండవలయుననియు తలచి వీనికి పూర్వస్థితిని బరిశీలింపకుండుటయే వారు వీనిని ధాతువులుగా బరిగణించుటకుఁ గారణము. ఏదెట్లయినను మొత్తముమీద ద్రావిడభాషలన్నిటిలోను ధాతువున కేదోయొక కారణముచే 'గు' అనునది చివర వచ్చుట తటస్థించుచున్నది. ఇదియొకపెద్ద విశేషము. ఇంతేకాక, ఇది భాషలో చాలా ప్రాచీనరూపమనికూడ తలంపదగియున్నది. ఈ 'కు' స్వరూపమును దెలియక తమిళులు 'కు' లేదా కిరు (కు + ఇరు), (గిరు)—అనుదానిని వర్తమానార్థక ప్రత్యయముగా జెప్పుచు, దానిని 'పెర్' 'వెళ్' అను హలంతధాతువులకు జేర్చి వర్తమానార్థక రూపములను నిష్పత్తిచేయుచున్నారు. ఈ 'కు'—'గు' అనునది కాలద్యోతకమై యుండుటను మఱచిన తెనుగు కన్నడులు ఈ 'గు' అంతమునే ధాతువుగా పరిగణించి దానిపై కాలపురుషద్యోతకములగు వేఱుపదములనో, ప్రత్యయములనో చేర్చి రూపములను బడయుచున్నారు. పెరుగుచున్నది అని మనము చెప్పుచుండ, 'పెరుక్కిరదు' అని వారు చెప్పుచున్నారు. వీనిలో సమానభాగముగా గనబడుచున్న 'పెరుగు—పెరుకు' అనునది ప్రాచీన భాషకు జెందిన రూపమైయుండును. ప్రాచీన జనసంఘములలో తెలుగుకన్నడులు, తమిళులనుండి విడివడిన తరువాత భాషను వ్యాకరించుటలో (analyse) వారు 'పెరుగు' అనుదానినే ధాతువుగా గ్రహించి దానిపైని 'చు' 'ఉన్న', అనువానిని కాలద్యోతకములుగా జేర్చియుండ, యీ తమిళులు, 'పెరు' నేధాతువుగా గ్రహించి

'షు'-'గు'-'ఇరు'లను కాలద్యోతకములుగా జేర్చిరి.
ు 'అది'-'అదు' అనునవి లింగద్యోతకపదములు
పెరుగుచున్నది" అనియు "పెరుక్కి-అదు" అనియు
నవి. ఇట్లు తెలుగున ధాత్వవయవముగా దలంప
న్న 'గు' అనుదానికిని, తమిళమున వర్తమానార్థక
ముగా దలంపబడుచున్న 'గిరు' (గు+ఇరు)
'గు' కును సన్నిహితసంబంధము కలదనియే,
అది రెండును ఒకటి యనియే నా యూహ.

దీనినిబట్టి వీనిలోని మూలరూపము 'గు' తో
ది కాదనియు, నీ 'గు' అనునది రెట్లో యేదో
ర్థమున నా మూలధాతువునకు జేర్పబడిన యొక
యొక్క యవశిష్టరూపం(Remnant)బనియు తె
న్నది. ఈధాతువులనుండి 'గు' అవసరము లేకుం
భాషలో బయలుదేరిన పదజాలమే దీనికి నిదర్శ
పెర్' అనుధాతువునుండి—పేర్మి, తమి. పెరుమై-
మి. పెరిశి. పేరురము, పేరాశ, పెర్గడ, మొద
ము; 'వెల్' అనుదానినుండి వెల్ల, వెల్లన, వెల
, వెలి, వెండి, వెల్లి (కన్న) ఇత్యాదులును 'గు'
లేకుండగనే బయలుదేరియున్నవి.

ఇట్లు 'పెర్' 'వెల్' 'తుణ్' మొదలగునవియే
రైనచో వానినుండి క్రియారూపములను నిష్పత్తి
ు డీ 'గు' ను చేర్చుటకు గారణమేమి? ఇది
శిష్టభాగము అని విచారింపవలసి యున్నది.
అంతములగు ధాతువులనుండి బయలుదేరిన
నామవాచకములలో నీ 'గు' 'కు' గా మారు
ం జేసి (మొళకు-మొలక, కలగు-కలక;
తునుక; పోగు-పోక, (etc) ఒకప్పుడీ 'గు' 'కు'
ముమ బొందునదై యుండెనని తలంపదగును.
రకు' మొదలగు వానిలో 'క్కు' కనబడుచు
గిరేన్' పోగిన్ద్రేన్, 'వర్గిరేన్-వర్గిన్ద్రేన్'
న్' మొదలగువానిలో 'గు' కనబడుచున్నే
. కావున నొకకాలమున ప్రాచీనతమిళమున
గు, వరగు, శెయ్గు, పెరగు, అను 'గు'
పములకు ఇరు+ఏన్ అనిగాని, లేదా

ఇన్+అు (తు) అనిగాని కాలపురుషద్యోతక ప్రత్యయములను జేర్చియుండిరనుట సంభావ్యముగా నున్నది.

ప్రాచీనద్రావిడభాషలో వర్ణభేదమును దెలుపుట కార్యభాషలలోవలె ప్రత్యయాదులు లేవనియు, నాయర్థభేద మొకపదమునకు మఱియొకపదము చేర్చుటచేతనే కలుగుచున్నదనియు, నొకవాక్యమందలి యర్థము అందలి పదముల విశేషణవిశేష్యభావసంబంధముమీదనే యాధారపడి యున్నదనియు నీభాషలయందలి విభక్తిప్రత్యయములను బరిశీలించినచో దెలియగలదు. 'మరత్తాల్' 'మరత్తిన్' 'నాచేత' 'చెట్టువలన' మొదలగువానిలో 'ఆల్' 'ఇన్'-చేత, వలన-యనునవి మొదట పదములై యర్థభేదమును సూచించుటకుగా మొదటి పదమునకు జేర్పబడి, తరువాత ప్రత్యయము లెట్లయినవో అట్లే పోగు, వెలుగు, పెరుగు, తునుగు మొదలగువానిలోని 'గు' పో, వెల్, పెర్, తున్, అను ధాతువులను క్రియలుగా మార్చుటకు జేర్పబడి, తరువాత వర్తమానార్థద్యోతకముగా గ్రహింపబడిన 'అగు' అను సహాయక్రియయొక్క యవశిష్టభాగంబై ప్రత్యయరూపమును దాల్చినదని యూహింపదగియున్నది. పెర్+అగు=పెరగు అనగా పెద్దదయగుట. 'వెండిచెంబు' అన్నపుడు వానికి విశేషణవిశేష్యభావ మెట్లు కుదిరినదో అట్లే రెండుధాతువులను జేర్చినపుడును వాని కాదికాలమున విశేషణవిశేష్యభావము కుదిరియుండును. పెరగు అనగా పెద్దదియైనది అగుట అనునర్థము వచ్చియుండును. అట్లే వెళ్+అగు=వెళగు, వెలుగు=తెల్లనైనది, ప్రకాశమైనదగుట. తుణ్+అగు=తునగు, తునుగు=ముక్క అగుట; తర్+అగు=తరగు, తరుగు=తక్కువదైనదగుట; మెల్+అగు=మెలగు=మెలమెలలాడుట; చలించుట; పో+అగు=పోగు=పోవునదగుట; వా+అగు=వాగు, నోరు (ధ్వని)కలదియగుట; పెన్+అగు=పెనగు=పెనువది అగుట; కుఱ+అగు=కుఱగు, కుఱుంగు, క్రుంగు=తగ్గిపోయినది, క్రిందికి పోయినది, పొట్టిది, అగుట-ఇట్లీరూపము లేర్పడియుండును. 'మరం' అనుదానికి ఇతరపదము తోడి (ఆల్-ఇన్, ఓడు etc.) సంబంధమును జూపుటకుగా అనగా సంబంధార్థమున 'అత్తు'-(అదు) అనునదొకటి చేర్పబడి

తరువాత కొంతకాలమునకు దానియర్థము రూపుమాసి పోవుటచే, "మరత్తు" అనునది కేవలము విభక్తిప్రత్యయములను జేర్చుటకుగా నేర్పరుపబడిన 'అంగము'(declensional base)గా నెట్లు గ్రహింపబడుచు వచ్చినదో, అట్లే యీ 'అను'కు సంబంధించిన 'గు' అను దానితో జేరిన పెరుగు, వెలుగు, పోగు మొదలగునవి కూడ ధాతువులుగనే గ్రహింపబడజొచ్చినవి. ఈ 'గు' అనునది కేవల ధాత్వవయవము కాదనియు, ఏకో యొక యర్థమున జేర్పబడినదే యను విషయము ద్రావిడభాషలలో తొలి వ్యాకరణంబగు తొల్కాప్పియములోని క్రియాపరిచ్ఛేదసూత్రము మనకు స్పష్టముచేయుచున్నది. తొల్కాప్పియనార్ ధాతువులకు 'కు, టు, తు, డు' అను ప్రత్యయములు వచ్చునని చెప్పుటచే, ఇవి ధాత్వవయవములు కావని మాత్రము స్పష్టముగా దెలియవచ్చుచుండె నేకాని వీనిలో నేవి యే యే కాలముల వచ్చునో యను విషయమున నాతని యభిప్రాయము నిశ్చయింప వీలులేనట్లున్నది.

ఏది యెట్లయినను ప్రాచీనభాషలో నీ'గు' వర్ణాంతరూపము లేర్పడిన తరువాతనే తెలుగు కన్నడములు ప్రాచీనభాషనుండి విడిపడియుండును. కావుననే యీ ధాతువులనుండి క్రియారూపములు చేయు మార్గ మాయాభాషలలో భేదించుట తటస్థించినది. తమిళులు పోగు, పెరుగు, మొదలగు ధాతువులకు 'ఇలు' 'ఇన్ను' అను మఱి యొక సహాయక్రియ (auxiliary verb) ను జేర్చి దానిపై పురుషవాచకరూపములను చేర్చుటకు మొదలు పెట్టగా, తెలుగువారు ఉరు, (ఉన్న – ఉండు) అను ధాతువుతో సంబంధించిన 'ఉన్న' అనుదానిని జేర్చి, దానిపై పురుషవాచకరూపములను గలిపి వర్తమానరూపములను జేయ మొదలుపెట్టియుందురు. ఇట్లు పెరుగు + ఇర్ + ఏన్ = పెరుగిన్రేన్' పోగు + ఇరు + ఏన్ = పోగిఱేన్ మొదలగున వేర్పడగా, పెరుగు + ఉన్న + అను = పెరుగు (చు)న్నాను. పోగు + ఉన్న + అను = పోవు (గు) (చు)న్నాను అనురూపము లేర్పడియుండును. ఈమధ్య వచ్చిన 'చు' అనునది ప్రేరణార్థకమున గొన్ని ధాతువులలో చివర నేర్పడినదై, కొంతకాలమున కాయర్థమును గోలుపోయి, కేవలప్రత్యయముగా జేర్పబడుచువచ్చినదేమో యని సందేహము కలుగుచున్నది. తొల్కాప్పియర్ నాటికే 'గు' 'గుం' మొదలగునవి వర్తమానార్థక ప్రత్యయములుగా దలంపబడుటంజేసి 'గు' అంతములగు రూపములప్పటికి చిరకాలము క్రిందటనే యేర్పడియుండవలయును.

ఇంతేకాక భాషలో వర్తమానార్థకరూపములే యర్వాచీనములనియు, ప్రాచీనకాలమున నొకప్పుడు తద్ధర్మార్థక రూపమువంటిదే త్రికాలములయందు నుపయోగపడుచున్న ట్లాంధ్రద్రావిడ భాషలయందు నెంటనుగూడ నిదర్శనములు కనబడుచుండుటచే నీ క్రియారూపముల పరిణామమును బట్టి ద్రావిడభాషల ప్రాచీనతనుగూర్చి కొంత మనమూహించుట కవకాశము కలుగునట్లు తోచుచున్నది. ఇట్లే పదముల చరిత్రము భాషాచరిత్రజ్ఞానమునకు దోడ్పడుచుండును.

## ర్పణము

తుమ్మల సీతారామమూర్తి చౌదరి గారు

(వెనుకటిసంచిక తరువాయి)

లో నిగ్గలిక్ గ్రుంగి మగ్గుచున్న-పుల్గుఁ బొడఁగాంచి విస్మయంబున మునింగి
నిట్ట నిలుచుండి బోయ నిర్నిమిష దృష్టిఁ-జేష్టలందక్క యొక్కింత సేపుగడపె.

తదనంతరంబున నతండు.

ఇమ్మెయి సాహసంబు గలదే? విలసత్కరుణారసార్ద్రి చి
త్తమ్మున నిల్గొనంగునె పతంగము స్వాంగ? మహో! విహంగ
సంఘమ్మున దీని కీడగు ఖగంబు జగంబున నున్నదొక్క? ని
క్కమ్ముగ నొక్కవేలు పగుఁ గాక కపోతమనంగఁ జెల్లునే.

కటకటా! జ్వలదగ్ని శిఖాకలాప-మెగసి తనకోమలాంగంబు నేర్చుచుండ
నెట్లు సైరించె? నా బాధ నీ పులుంగు-కొఱలు నా వేశమున మేను మఱచె నోటు?

అగ్గలమైన సీతువున నంగము కొంగరవోవ మృత్యువుక్
డగ్గఱియున్న నన్గని హుటాహుటిఁ బల్లెకు నేగి ముక్కుతో
నగ్గిని దెచ్చి కోటరమునందలి గూటినిగాల్చి నాచలిక్
దగ్గనొనర్చి కూర్చెనుగదా! ముద మియ్యది నాకు ముందరన్.

కట్టా! దీనల దనియక-పెట్టుము నా కన్నమనుచుఁ బీడించితి లేఁ
బిట్టక్ దుట్టతుదకు నా-పొట్టం బెట్టుకొని నీచపుంగతిఁ గంటిన్.

లోకు లీకరణిం బ్రాణిలోకమునకు-మేలు గావించుచుంద్రు కాఁబోలు సతముఁ
బుట్టువుందొట్టి యుపకృతి పొంతఁబోని-కట్టిఁడిని నేను నాకెట్టి గతులుగలవొ?.

'భగవంతుఁడు నన్నేటికి-జగమునఁ బుట్టించె? నాదు జన్మంబునకుక్
దగుఫలమెయ్యది? యని లో-వగవక నాజీవనమ్ము" వమ్మొనరిచితిన్.

ధర్మశాస్త్రజ్ఞులెల్ల రెద్దానిఁ "బరమ-పాతకనిదాన మిది" యంచుఁ బల్కుచుందు
రట్టి హింసయు నావ్రతం బయ్యె నెపుడు-నకట నాపాప మేనాఁటి కడఁగిపోవు!

## ఒక లాభకరమగు వృత్తి

ఉద్యోగములు దొరకుట చాల కష్టముగానున్న యీరోజులలో యిది గొప్పలాభము

మామూలు తెలివి తేటలను తగు మాత్రమైన శ్రద్ధయును కల వారికి గూడ **యునైటెడ్ ఇండియా** లైఫ్ ఎస్యూరెన్సు కంపెనీవారు శ్రేష్ఠమైనవృత్తిని కలుగజేసెదరు. ఇంగ్లీషు భాష రానవసరములేదు.

**యునైటెడ్ ఇండియా** కంపెనీ భీమాకంపెనీ లన్నిటిలోను అనేక కారణములవలన ప్రజల కెక్కువ ఆకర్షకముగా నున్నది:—

**యునైటెడ్ ఇండియా** కంపెనీ భారత దేశములోనిది. భారతీయులు దీని నధికముగా ప్రేమించుట కీయొక్క కారణమే చాలును.

**యునైటెడ్ ఇండియా** కంపెనీ మదరాసు ప్రెసిడెన్సీలోనిది. దీని నధికముగా ప్రేమించుట కిదియే ముఖ్యకారణమని చాలమంది తలచుచున్నారు.

రాష్ట్రీయాభిమానము, మున్నగు సంకుచిత భావములతో యీ కంపెనీవారు ప్రజల ఆదరణను కోరుటలేదు. భీమాకంపెనీల సిద్ధాంతముల కనుగుణ్యమైనట్టియు, భీమాకంపెనీలకు సాధ్యమైనట్టియు రీతిని సౌకర్యములను, లాభములను ఉత్తమరీతిని పాలసీ హోల్డరులకును, భీమాచేయించు కొనునట్టి ప్రజలకును, కలుగజేయు విషయమునందే డైరెక్టరులును, కార్యనిర్వాహకులును నిరంతరము కృషి సల్పుచుందురు. అనునదియే ప్రజలు దీనినాదరించుటకు ప్రధానకారణమై యున్నది.

అన్ని ప్రాంతములలోను ఆలస్యము లేకుండ ఏజంట్లను నియమించుచున్నాము. ఇదివరకు ఏజంట్లను నియమించని స్థలములలో పనిచేయుట కిష్టమున్న వారు దరఖాస్తులను పంపవలెను. ఈ పనియందు గట్టి ఆసక్తిగలవారు వెంటనే యీ కంపెనీకిగాని, యీకంపెనీ తరఫున ఆంధ్రరాష్ట్రమునకు చీఫ్ ఏజంటుగా బెజవాడలో నున్న టి. వి. కృష్ణస్వామి బి. ఏ., బి. ఎల్. గారికిగాని దరఖాస్తులను పంపవలెను.

యునైటెడ్ ఇండియా
ఎస్యూరెన్సు బిల్డింగ్సు,
పోస్టుబాక్సు, 281, చెన్నపురి.

స్టార్ & కంపెని,
మేనేజర్సు.

## ఒక లాభకరమగు వృత్తి

ఉద్యోగములు దొరకుట చాల కష్టముగానున్న యీరోజులలో యిది గొప్పలాభము

మామూలు తెలివి తేటలను తగు మాత్రమైన శ్రద్ధయును కల వారికి గూడ **యునైటెడ్ ఇండియా** లైఫ్ ఎస్యూరెన్సు కంపెనీవారు శ్రేష్ఠమైనవృత్తిని కలుగజేసెదరు. ఇంగ్లీషు భాష రానవసరము లేదు.

**యునైటెడ్ ఇండియా** కంపెనీ భీమాకంపెనీ లన్నిటిలోను అనేక కారణములవలన ప్రజల కెక్కువ ఆకర్షకముగా నున్నది:—

**యునైటెడ్ ఇండియా** కంపెనీ భారత దేశములోనిది. భారతీయులు దీని నధికముగా ప్రేమించుట కీయొక్క కారణమే చాలును.

**యునైటెడ్ ఇండియా** కంపెనీ మదరాసు ప్రెసిడెన్సీలోనిది. దీని నధికముగా ప్రేమించుట కిదియే ముఖ్యకారణమని చాలమంది తలచుచున్నారు.

రాష్ట్రీయాభిమానము, మున్నగు సంకుచిత భావములతో యీ కంపెనీవారు ప్రజల ఆదరణను కోరుటలేదు. భీమాకంపెనీల సిద్ధాంతముల కనుగుణ్యమైనట్టియు, భీమాకంపెనీలకు సాధ్యమైనట్టియు రీతిని సౌకర్యములను, లాభములను ఉత్తమరీతిని పాలసీ హోల్డరులకును, భీమాచేయించుకొనునట్టి ప్రజలకును, కలుగజేయు విషయమునందే డైరెక్టరులును, కార్యనిర్వాహకులును నిరంతరము కృషి సల్పుచుందురు. అనునదియే ప్రజలు దీనినాదరించుటకు ప్రధానకారణమై యున్నది.

అన్ని ప్రాంతములలోను ఆలస్యము లేకుండ ఏజంట్లను నియమించుచున్నాము. ఇదివరకు ఏజంట్లను నియమించని స్థలములలో పనిచేయుట కిష్టమున్నవారు దరఖాస్తులను పంప వలెను. ఈ పనియందు గట్టి ఆసక్తిగలవారు వెంటనే యీ కంపెనీకిగాని, భీమాకంపెనీ తరఫున ఆంధ్ర రాష్ట్రమునకు చీఫ్ ఏజంటుగా బెజవాడలో నున్న ..తి. వి. కృష్ణస్వామి బి. ఏ., బి. ఎల్. గారికిగాని దరఖాస్తులను పంపవలెను.

యునైటెడ్ ఇండియా
ఎస్యూరెన్సు బిల్డింగ్సు,
పోస్టుబాక్సు, 281, చెన్నపురి.

స్టార్ & కంపెని,
మేనేజర్సు.



శ్రీయుత పండిత మోతీలాలు నెహ్రూగారు, అధ్యక్షులు

౪౩-వ అఖిలభారత జాతీయమహాసభ, కలకత్తా



శ్రీ. జె. యమ్. సేనగుప్తగారు, ఆహ్వానసంఘాధ్యక్షులు

౪౩-వ అఖిలభారత జాతీయమహాసభ, కలకత్తా

## నాజూకైన పనితనము!   అద్భుతమైన అందము!!



మావద్ద ఒకబేరము చేసిన, తరువాత మీ రెప్పుడు మావద్దనే బేరము చేయుదురు. ఇతరులకు కూడ సిఫార్సు చేయుదురు.



మా సంగతి మేమే తెలుప మాకిష్టము లేదు. మమ్ములను మా వ్యాపార పద్ధతుల గురించి యితరులు యేమి తెలుపునది గమనింప ప్రార్థితులు.



నమ్మకమునకు, పనితనమునకు,
అందమునకు, సుప్రసిద్ధమైన మెఱుగునకు,



## నగల దుకాణము

(1) మొదటిరకము సీమకమలములు, పుష్యరాగములు, కెంపులు, సవరం బంగారు, సీమవెండి మొదలగువాటిచే తయారుచేయబడిన నగలు సిద్ధముగా నున్నవి.

(2) సాదా ఉంగరములు, కెంపులు, పుష్పరాగములు, కెంపు సీమకమలములు చేర్చికట్టబడిన జడబిళ్ళలు, తోడులు, మాటీలు, నాగరలు, హంసబిళ్ళలు, యెంతధరలో గావలసినను సరాఫరా చేయబడును.

(3) నవనాగరికమునకు తగిన పలురకముల నాణ్యమైన బంగారు గాజులు, వంకీలు, నాగవత్తులు, నెక్ చెయినులు, వడ్డాణములు మొదలగునవి తయారుగా నున్నవి.

4 వెండిపూలబుట్టలు, క్రైజుకూజాలు, టీ కాఫీ సెట్లు, టూర్నమెంటు కప్పులు, పన్నీరుచెంబులు, చందనగిన్నెలు, వెండి బంగారు మెడలులు మొదలగునవి సిద్ధముగా నున్నవి.

5 పూజకు అర్హమైన వెండివిగ్రహములు, పటములు ఎంతఎత్తులో, ఎంతసైజులో కావలసినను మావద్ద హాజరులో నున్నవి.

## ముఖ్యగమనింపు

అప్పటమైన సీమకమలములకు, కెంపులకు, పుష్యరాగములకు
సవరం బంగారుకు, వెండికి పూచీనిచ్చెదము.

## ఉమ్మిడి బంగారుశెట్టి అండు సన్సు,

సీమకమలములు, బంగారు, వెండినగల వర్తకులు,

పరిశ్రమశాల:— షోరూం:—
226, గోవిందప్పనాయుని వీధి, 28, చైనాబజారురోడ్డు,
మద్రాసు. మద్రాసు.



# పిడుగు వేంకటకృష్ణారావు పంతులు,

## వైద్యగ్రంథములు

| | | |
|---|---|---|
| ంతామణి 2 సంపుటములు | 8 | 0 |
| జీయము | 7 | 0 |
| హృదయము సూత్రస్థానము | 6 | 0 |
| శారీరస్థానము | 1 | 8 |
| నిదానస్థానము | 2 | 0 |
| చికిత్సాస్థానము | 4 | 8 |
| కల్పస్థానము | 0 | 12 |
| ఉత్తరస్థానము | 6 | 0 |
| ము, శారీరస్థానము ప్రాచీనము | 2 | 8 |
| ర సంహిత | 3 | 0 |
| రి నిఘంటువు సవరణప్రతి | 2 | 8 |
| పాఠము (గుణపాఠము) | 2 | 8 |
| నమంజరి | 0 | 8 |
| రరత్నాకరము | 0 | 12 |
| మేలుప్రతి | 1 | 0 |
| తరంగిణి | 0 | 12 |
| మేలుప్రతి | 1 | 0 |
| జీవనము, లోలంబరాజీయము | 0 | 8 |
| రత్నము, స్త్రీరోగ బాలరోగచికిత్సలుగలవు | 1 | 4 |
| సారము | 2 | 8 |
| మృతము ఇందులో అజీర్ణమంజరి చేరియున్నది | 1 | 4 |
| ధ గుణకల్పకము | 2 | 8 |
| కల్పద్రుమము శరీరపుష్టివిధానము | 1 | 8 |
| లజ్ఞానము | 0 | 4 |
| త్రమాల, నాడీనిర్ణయము | 0 | 4 |
| నము | 0 | 3 |
| దానము [నూతనవ్యాఖ్య] | 3 | 0 |
| ల్పము [గోపాలాచార్యులు] | 1 | 4 |
| రరత్నాకరము | 0 | 12 |

## జ్యోతిష గ్రంథములు

| | | |
|---|---|---|
| యవనజాతకము | 0 | 8 |
| జాతకాలంకారము | 0 | 6 |
| ఆరూఢరత్నసిద్ధాంజనము | 0 | 8 |
| జ్యోతిషార్ణవనవనీతము అట్టరెండు | 1 | 8 |
| ,, కాలికోబైండుచేసి పేరుకూడముద్రించినది | 2 | 0 |

### పోకల శేషాచలనాయని విరచితము

| | | |
|---|---|---|
| శ్రీకృష్ణబోధామృతము 12 రాజులకథలు | 0 | 12 |
| పరమపదమార్గము | 0 | 8 |
| వసిష్ఠజనకసంవాదము | 0 | 8 |
| నిర్వచనస్వరదర్పణము | 0 | 8 |
| గరుడగీతలు, టీ-తాత్పర్యము | 1 | 4 |
| శ్రీకృష్ణరుక్మిణీసంవాదంబను సుజ్ఞానశాస్త్రము | 0 | 8 |
| షట్చక్రవర్తుల ఇంద్రజాలపుకథలు | 0 | 8 |
| సుజ్ఞానరత్నావళి | 0 | 8 |
| ఆంధ్రపంచీకరణము | 0 | 2 |
| అచలసద్గురుసంకీర్తనలు | 0 | 6 |
| జనకశుకభిక్షుసంవాదము | 0 | 8 |
| జడభరతోపాఖ్యానము | 0 | 8 |
| శుద్ధనిర్గుణతత్వకందార్థములు [అచ్చులోనున్నది] | 0 | 12 |

### చిలకపాటి-వేంకటరామానుజశర్మ విరచితము

| | | |
|---|---|---|
| వినోదకథాకల్పవల్లి | 3 | 0 |
| కాళిదాసచరిత్రప్రకరణము | 1 | 8 |
| చమత్కారకథాకల్లోలిని 1 భాగము | 0 | 12 |
| ,, 2 భాగము | 0 | 12 |
| శ్రీమదాంధ్రభోజచరిత్ర అచ్చగుచున్నది | 1 | 0 |

N. B. ఇవిగాక, అనేకసంస్కృతాంధ్రగ్రంథములు మొదలైనవాట్లకును, అచ్చుపనులకును వ్రాసిన జవాబియగలరు. క్యాటలాగు నుచితము.

ఇదివరలో అచ్చుపడిన గ్రంథములన్నియు సవరణ చేయుచున్నాము.

**2/40, పెద్దినాయనివీధి, మద్రాసు.**

# త్వరపడుడు! సతీపతికుతూహాల రహస్యములు. త్వరపడుడు

ఇకను మోసపు పుస్తకములను కొని మోసపోకుడు!!!

ఇట్టి గ్రంథ మిదివర కాంధ్రభాషలో వెలువడియుండలేదు. ఇందు గృహస్థాశ్రమధర్మము, సతీపతు లని న్యప్రేమతో వర్ధిలగల విధులు, ప్రేమతత్వము, స్త్రీజాతులు, పురుషజాతులు, వాని ప్రవర్తనలు, జాతుల సాం ములు, వానియొక్క అభిప్రాయము, శయ్యాగృహరహస్యములు, వానిలక్షణములు, ఎట్టి సతీపతుల కెట్టి సం నము గలుగు సమవిషయము, గర్భవిషయములు, గర్భస్త్రీ లనుసరింపవలసిన విధులు, గర్భవతుల యారోగ్యావశ్య శిశురక్షణ, అత్తకోడండ్రవైరములకు గల కారణములు, వానిని శమింపజేయు నుపాయములు, వారి కుండవల స్నేహావశ్యకత, మున్నగు 280 విషయములతోను, సందర్భానుసారముగ గల ఆఫ్టోన్, లైన్బ్లాకులు 25 తో గ్లేజ 410 పేజీల పైబడిన సీమకాలికోతోను చక్కని బైండుతో విరాజిల్లుచున్నది. ప్రతిగృహస్థుడు తప చదివితే తీరవలెను. కొద్ది ప్రతులే గలవు.

పుస్తకము 1-కిరు.2-0-0. పోస్టేజి 7 అణాలు. 2 పుస్తకము లొకేసారికొనువారికి తపాలఖర్చు లేద

మా చిరునామా:—ఆర్యన్ బుక్ డిపో,

19, తాండవరాయ మొదలి వీధి, తిరువళిక్కేణి, మద్రాసు

---

## మేలైన అసలు పుష్యరాగములు




వీటిచే నాణ్యముగా కట్టబడిన జడబిళ్లలు, తోడులు, ముక్కు-పుడుకలు, బేసరీలు, మోపులు, ఉంగరములు వగైరా నమ్మకముగా దొరకునట్టి స్థలము.

పరిశ్రమశాల:— జలగం సుబ్రహ్మణ్యం నాయుడు అండు కో

96 వరదాముత్తియప్పన్ వీధి. ప్రదర్శనగది, చైనాబజారురోడ్, మద్రాసు

---

**Revised & Enlarged Editions of**

**Sankaranarayana's English-Telugu Dictionary**

శంకరనారాయణగారి ఇంగ్లీషు-తెనుగు నిఘంటువు రూ. 8-0-

**Sankaranarayana's Telugu-English Dictionary**

శంకరనారాయణగారి తెనుగు-ఇంగ్లీషు నిఘంటువు రూ. 5-0-

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

తంతి అడ్రెసు: 'వావిళ్ల' మదరాసు. 292, ఎస్ప్లనేడ్, చెన్నప

పొదుగు శుకాంగనన్ జదివి బుట్టను బెట్టితిఁ; దల్లిదండ్రులన్
వదలనిగోరువంక మెడ వంచితిఁ; ద్రుంచితిఁ గుంజసీమలన్
బొదలు కపోతదంపతులఁ; బొంగుచు నేసితిఁ జూడి మోఁపురన్
గదలని లేడిపిండుఁ; బెలుకల్మషముల్ దడవంగ నేటికిన్.

శాకాదుల మెసవి యసం-ఖ్యాకములగు భూతములు సుఖస్థితిమై నీ
లోకమున లేవొకో? యవి-వేకమ్మున నేన యిట్టివెంగలి నైతిన్.

ఉత్తమ మానవజన్మం-బెత్తియు నేఁ జెడితి జ్ఞానహీనుఁడనై; లో
కోత్తరచరిత్రుఁ బుల్గు బు-ధోత్తంసస్తోత్రమునకు యోగ్యంబయ్యెన్.

స్వార్థమును వీడనాడి పరార్థమునకు-నర్థమును మానమును మేని నప్పగించు
పుణ్యమూర్తి చరిత్రంబవో సమస్త-జగతి కాదర్శమై సుప్రశస్తిఁ గాంచు.

మంజులంబుగఁ బెక్కు ధర్మములు వల్కు-చేతలం దొకఁడే ననుష్ఠింపలేని
వదరుఁబోతుల కిఁక సిగ్గు వచ్చుఁగాత-మేతదల్పకపోతవిఖ్యాతచరిత.

క్షుద్రుఁడనై గాఢ తమో-నిద్రారతి నున్ననన్ను నిర్వ్యాజకృపా
ముద్రిత హృదయంబునఁ గడు-భద్రంబుగ మేలుకొల్పెఁ బక్షి గురుండై.

తగుబుద్ధి సెప్పెఁ బావుర-మిఁక మానెద జీవహింస; నెడఁబాసెద నీ
చగుణంబులఁ; గామంబులఁ-దెగటార్చెద; విడతు సంసృతిన్; ధర్మరతిన్.

గురువుల సేవించెద; నీ-శ్వరతత్త్వ మెఱింగెదన్; భవంబులఁ ద్రుంతున్;
నిరుపమ నిరుపద్రవ సు-స్థిరతర కైవల్యసౌఖ్య సిద్ధింగాంతున్.

అని పెక్కుభంగుల విచారించి యంతరంగంబునం బొంగిపొరలు వైరాగ్యభాగ్యంబునం జేసి హింసావృత్తమ్ము నెడఁబాసి తుచ్ఛంబులగు విషయోపభోగంబుల రోసి పురుషార్థంబునందు డెందంబుం బదిలపఱచి యుండె నయ్యవసరంబున.

వలఁ జిక్కియున్న పుల్గులు-చలిగాలికి నడలి తాళఁ జాలక జీవం
బుల మీఁది యాసలెల్లం-దొలఁగ విలాపించుచుండె దుర్భరచింతన్.

ఆయార్తనాదములు విని-బోయం డెద మిగుల జాలి పొంగారఁగ "నా
రాయణ నారాయణ నా-రాయణ" నాపాప మెక్కరణి రూపడఁగున్.

అంచు నవ్వలం దరిసి.

మొలఁగల కత్తి దీసి వల ముక్కలు ముక్కలు చేసి యుచ్చులన్
బలితములైన చిక్కములఁ బట్టి రయంబునఁ గోసి కాల్వలై
జలజల నశ్రుతోయములు జాల్కొనఁ బుల్గులనెల్ల నల్లవో!
వెలలిచు; నేటి కెట్టి సువివేకిముగ్గలెఁ గసాయిబోయకున్.

అంత నతండు దనకొదవిన యెఱుక బలిమిం బారలౌకిక చింతాసాగర నిమగ్నుండయి యంద నిలువంబడియుండెఁ; బదంపడి బంధవిముక్తిం గనిన విహంగంబులు మెల్ల మెల్లన ఱెక్కల నల్లార్చుచుఁ బరిసరతరుశాఖల నధిరోహించెఁ; బిదప మూర్ఛామగ్నయై యొడలెఱుంగక పడియున్న కపోతి యప్పుడ మేల్కొని యున్మిషితలోచనయై నలువలంకులఁ గలయం దిలకించి చెలువుని గానక.

జీవితనాయక, నీవు-న్నావొకొ? జీవంబుతోడ; నాతికి యుష్మ
త్పావనరూపముఁ జూపఁ గ-దేవల్లభ, యంచు లేచె ధృతిదూరముగన్.
లేచి యనలంబు కడ్రవాలి చూచె నందు-లీనమగుచున్న మగని సుజ్ఞాన ఖనిని
చూచినంతనె శోకంబు చుట్టు ముట్ట- నిట్టు విలపించెఁ గానయు బిట్టు వగవ.

వల్లభ, వల్లభ! మంటం-ద్రెళ్లితె? యీదీనురాలి దిక్కెవ్వరఁటం
చుల్లంబునం దలంచితి-చెల్లరె! నీకింత కఠినచిత్తము తగునే?

ఇది భవదధీన జీవిత-గద! దీనిం డించి పోవఁగా నకటా! నీ
హృదయ మెటులియ్యకొనె? నా-కెది తెరు? వికఁ జేయుకార్య మెయ్యది నాథా?

నాకడుపు నిండుటకు మును-నీకుతిం జూడవెపుడు; నే నించుక బా
ధాకలితనైన నోర్వవు-నీకూరిమి పేరిమి న్గణింపఁ దరంబే.

లలిత లావణ్య పల్లవ వితాన లతాంత సముపేత మంజుకుంజములయందు
గ్రావప్రసన్నదీ కమలశీకరసిక్త శీతలాద్రిప్లవశ్రేణులందు
బాలరసాలద్రుజాల కోమల లతా స్తోమాంచితారామసీమలందు
సుందర వికచారవింద మందిర దీర్ఘికా మనోహరతీరభూములందు
నిరుపమవిశుద్ధ హర్షవార్నిధితరంగ-డోలికాపంక్తులందు నూయేల లూపి
నన్ను మదిఁ దేల్చి నట్టి నీ నవ్యలీల-మఱతునే నాథ, యెన్నిజన్మములకైన?

పతి మరణానంతర మీ-క్షితి నొక్క నిమేషమేని జీవనయాత్రక్
సతి గడపుట దుస్సాధ్యం-బతిదుష్కర మని యెఱుంగవా హృదయేశా?

కుసుమకోమలమైన నీ గోనబు మేను-వీతిహోత్రున కెట్టు లర్పించి తకట!
అతిథి సేవాపరాయణం బైన నీదు-చిత్త మెంతకుఁ బెరరేచ జీవితేశ?

నేన నీకంటెమును మరణింతు నంచు-నాకొఱకుఁ గుందితివిగదా నాథ, నీవు
తుదకు నాకంటె మును నీవ త్రుంగి తకట!-యేగడియ కెద్దిమూఁడునో యెవ్వఁడెఱుఁగు?

ప్రాణపతి, నాకు నీవు నీకేను నెట్టి-విప్రియంబుల నెపుడుఁ గావింపము గద
యేల యీలీల నీకొఱకేడ్చు సతికిఁ-గానుపింపవు నీవు నిష్కారణముగ ?

మూర్ఛయందున్న నన్ను కన్నొఱఁగి యిదియ-సమయమని యెంచి క్షణభిన్నసౌహృ
దగుచు నన్నిటడించి నీ వమరపురికిఁ-జేరఁదలఁచితె? నీ కిట్టి సేఁత తగునె? [దుండ

"సుదతీ! నామదినుండె దీవెపుడు" నంచుఁ మత్ప్రియార్థంబు నీ
వెది భాషించితో! దానిఁ గైతవమఁటం చేనిప్పు డూహింతు న
య్యది నాథా, మెఱమెచ్చు గానియెడ నీ వంగచ్యుతిం జెంద నం
దద నాదేహ మొకింత భంగము? నీకేలా వేఁగు సిద్ధాంతముల్?

అని భర్తృమరణ సంజనిత దుఃఖాతిరేకంబునఁ బెక్కుభంగులఁ గొంతడవు పనవి పనవి పదంపడి యొఱుక లఱచుగల దగుటం జేసి నాకింక నెద్ది కర్తవ్యమని యూహించి తామున్ను విన్న సతీ ధర్మంబుల సంస్మరించి.

మగని ననుగమించి మరణించు నిల్లాలు-పతియుఁ దానుఁ బుణ్యగతుల కేగి
యతులసౌఖ్యపదవి నంది భవంబులఁ-ద్రెంచునంచు బుధులు దెల్పవిందు.

కావున జీవితేశ్వరు నెయిదుటయ నాకిపు డవశ్యాచరణీయం బని నిశ్చయించి తేని నుద్దేశించి.

నీ యొడలిలోన నగపాలు నిలిపి బోయ-కప్పన మ్మొనరింతె? శేషాంగ మిట్లు
దీనఁగల్గు నె పూర్ణాతిథేయ సుకృత? -మతిథి కర్ధాన్న మిడుట న్యాయంబె నాథ?

ఏపుణ్యమునం దైనను-నాపాలి నొసంగకుంటె నాథా, మును? నేం
డీపుణ్యకార్యమందున్-నాపాలిని బంచుకొంట నాయంబ కదా!

నీ యనితర వితరణమున-బోయకు నుదయించె స్వప్రబోధము దానన్
నాయురులం ద్రెంపె నాతండు-పోయె దురంతంబు నాదు పుణ్యముకతనన్.

సురుచిరనందన విహాగీ-పరిరంభణములకు నీవు పాల్పడుటకు ముం
దరుదెంచి నిన్నుం గూడె ద-నఱలేని మనంబుతోడ ననలాధ్వమునన్.

నాథ, యిపుడే నినుం జేరినను "గపోతి-యిస్సిరో! జీవితేశ్వరు నెడసి పుడమి
రెండు మూండు నిమేషంబు లుండనోర్చె"-ననెడిసడి నాకుం దప్పనే(?) యక్కటకట!

నెలతో వెన్నెల దొలంగున్-జలదముతో నరుగు మెఱుపు చానలు తమభ
ర్తల ననుగమించు వారని-తెలిపెడిని విచేతనములుం దెల్లముగాంగన్.

రమ్యకుసుమంబ వీవు సౌరభమ నేను-నిండునెల వీవు పండువెన్నెలను నేను
పదమ వీవు తదర్థసంపదను నేను-కలదె యన్యోన్య విప్రయోగంబు మనకు?

అని పలికి సన్నగిల్లు ననలంబుం జేరువ చిదుగుల నెగంద్రోచి దరికొల్పి యావేశ వికాస హర్షంబులు ముప్పిరిగొన నిష్ఠం జుట్టివచ్చి.

ఉల్లమునం గపోతవిభు నుజ్జ్వలమూర్తిం దలంచి "నిల్వుమో
వల్లభ! పోకుపోకు మిదె వచ్చితి వచ్చితి" నంచుం బల్కుచున్
నల్లవో! మంటలో దుమికి నాథునిడాపటం బవ్వళించి తాం
ద్రెళ్లె జగంబునన్ నిజసతీత్వము నెల్లరు మెచ్చునట్లుగన్.

అంత నగ్గువ్వ జవ్వని.

నవ్యప్రభావిభాసుర-దివ్యవిమానంబు నెక్కి దీపించు పతిన్
భవ్యగుణుం గూడి సజ్జన-సేవ్యంబగు నాకమునకుం "జివ్వ"న నేగెన్.

అచ్చట నచ్చర లెదుర్కొ-వచ్చియు స్వాగతము నడిగి వాలిన మోదం
బచ్చుపడ నమ్మిథునమున-కెచ్చిరి హారతులు విబుధులెల్లం జెలంగన్.

పదంపడి.

నందనవనహరిచందన-మందారాదిక సురద్రుమముల నమందా
నందంబు చింద నప్పలుఁ-గుందోయి సుఖించుచుండెఁ గూరిమిపేర్మిన్.

బోయఁడిట నట్లుచనిన కపోత మిథున-వర్తనమ్మును గాంచి "వహ్వా" యఁటంచు
మెచ్చి తానును నట్లుగా నిచ్చగించి-తుచ్ఛ దేహాభిమానంబుఁ ద్రుంచివైచి.

ఆలుబిడ్డలమీఁది యాసల విడచి-పోల నైహిక బంధములనెల్లఁ గోసి
అఖిలేంద్రియమ్ముల నాత్మ నడంచి-నిఖిలేశు నెడఁదలో నియతిమై నిల్పి
ముక్తకేశుండయి మునివృత్తిఁదాల్చి-ముక్తికాంతాకరమ్మును బట్ట నెంచి
రయమున దుర్గమారణ్యంబు సొచ్చి-పయనమయ్యెను మహాప్రస్థానమునకు.

నిడువాలికముండులు దన-యొడలింగడుఁ జీల్చ నెత్తు రుడుగక నడవఁ
దడపుచునుండ నతం డది-యెడఁదడవక నడచుచుండె నెడలని కడఁకన్.

ఇట్టు లయ్యెఱుకుజెట్టి పట్టి బెట్టిదంపు టిక్కట్టులనేని సరకుగొనక దీక్షాబలంబు
గిరిసరిదరణ్యంబు లనేకంబులు గడచి పుణ్యభూమి యను నాస నుత్తరాభిముఖుండై
పోవం బోవ.

దావానల మొక్కెడఁ-ద్యావాభూమ్యంతరములఁ దగ నలమి వన
శ్రీఁ బోవఁగఁ దీండ్రించుచు-నా విమలాత్మునకు బోయ కడ్డంబయ్యెన్.

అతం డందుల కెంతయు సంతసించి.

ఓ పరమేశ్వర, మత్కృత-పాపంబుల నెల్ల సైఁచి భవసంబంధ
వ్యాపారముఁ బాపఁగదే-నీ పాలం బడితి దిక్కు నీవ దయాబ్ధీ!

అని ప్రార్థించుచు నించుక-యనుమానములేక తద్దవానలమం దో
య్యనఁజొచ్చి మైఁ దొఱఁగి పా-వన దేవత్వంబువడసి వన్నియకెక్కెన్.

---

# ంగలక్షణశేషము - తన్నామ విచారణము

కొత్త సత్యనారాయణ గారు

త్రవాఙ్మయమున ముక్కు మొగముగల
షానుశాసక గ్రంథములలోఁ బ్రౌఢ
ణమును గూడ నొక్కటిగఁ బరిగణింప
. ఈ గ్రంథమునకు నేతద్గ్రంథకర్తలే
యమును బ్రకటించి యుండిరి. అం

లింగలక్షణశేషము" అనునది.

నామ మేతద్గ్రంథవిషయమై యెంతవఱ
యున్నో యయ్యది యిట నించుకంత
ంచుటయే ముఖ్యోద్దేశము.

క్షణపద మనేకార్థములకు బోధకమై
. అలంకారగ్రంథములు లక్షణగ్రంథ
ు, ఛందోగ్రంథములు లక్షణగ్రంథము
భాషానుశాసకగ్రంథములు మున్న
. లక్షణగ్రంథము లనియుఁ జెప్పఁ
్నవి. ఇట్లే ఆలంకారికులను, ఛాంద
(ఛందోగ్రంథకర్తలు), వైయాకరణు
క్షణికులని వ్యవహరించుట నైజము.
ంమందు నిందలి తృతీయార్థమే చెప్ప
చెప్పినచో "ఆంధ్రభాషానుశాసక
లకు" అని యుపర్యుక్త "త్రిలింగ
పదమున కర్థము తేలినది. ఆ గ్రంథ
శేషము- అనఁగాఁ దదుద్దిష్టవిషయ
శేషగ్రంథ మియ్యది యని ఫలితా

ర్థము. ఆ ఫలితార్థమే యిట విచారణీయ విష
యమై యున్నది.

ఆంధ్రవాఙ్మయమున లక్షణగ్రంథముల తీరు ద్వివిధముగఁ గన్పట్టుచున్నది.

పూర్వపుటాంధ్రలాక్షణికు లనేకులు సంస్కృతభాషయందును నఖండపాండితీమండితులు గాన, సంస్కృతభాష "అతిపవిత్రమైన దనియు నం దెట్టివిషయము ప్రతిపాదితమైనను నయ్యది పూజ్యము, ప్రామాణికమునయ్యెడు ననియుఁ దలఁచి యాంధ్రభాషావిషయములను గూడ సంస్కృతభాషయందే కూర్చి గ్రంథములు రచించిరి. అట్లు కూర్చి రచింపఁబడిన వానిలోఁ జేరినవే ప్రథమాచార్యులయు, ద్వితీయాచార్యులయు భాషానుశాసకగ్రంథములు. ఈ మార్గ మిట్లుండ మఱికొందఱు పూర్వోక్త విషయములను సులభమగు వచనరచనను దెలుపఁదగువానిని ఆంధ్రభాషయందే పద్యగ్రంథములయందుఁ బ్రతిపాదించియున్నారు. ఆంధ్రభాషాభూషణము, అప్పకవీయము కవిసంశయవిచ్ఛేదము మున్నగునవి ఈ తెగలోఁ జేరినవి.

ఏతదుభయవిధ గ్రంథములలో వేనికైనను బ్రకృతగ్రంథము శేషగ్రంథముగా నుండవలయును గదా! అది యెంతవఱకుఁ బొసగునో విచారింతము.

మొదటి తెగలోఁ జేరిన ద్వితీయాచార్యుల "వికృతివివేకము"లోని పెక్కు విషయములే ప్రకృత ప్రౌఢవ్యాకరణమునందును బ్రతిపాదింపఁబడినవి. వాని నిట దిఙ్మాత్రముగ నుదాహరింతును.

(౧)

సంధి ర్నిత్యం ప్రత్యయాచాచ స్తథార్యాదిగ స్యచ. —(అథర్వణులు. సంధిపరి. ౪ శ్లో.)

ప్రశ్నతౌవాచకంబులకు చార్యాంబాద్యర్థక శబ్దంబులు పరంబులగుచో నన్నియచ్చులకును సంధి నిత్యము. ప్రౌఢవ్యాకరణ. సంధి. ౧ సూ.

(౨)

శ్లో. మానార్థా నిత్య మేకత్వ మెడు స్స్యాత్పరిమాణకే.
—అథర్వ. సంధి. ౮ శ్లో.

పరిమాణార్థంబునం బ్రథమైకవచనమునందు ఎడు వర్ణకంబగు. —ప్రౌఢ. తద్ధి. ౧౬ సూ.

(౩)

శ్లో. కేచి ద్వద స్త్యథేదత్వ మనుస్వార మకారయోః.
—అథ. సంధి. ౧౨ శ్లో.

ప్రాసంబున మకారంబు పరంబగుచో ద్రుతంబునకు మకారాదేశంబగు. —ప్రౌఢ. సంధి. ౨౨. సూ.

(౪)

శ్లో. ఏకత్వే సస్యవాచిత్వం బహుత్వే ధాన్యవాచితా,
లోపాదేశ వికారాస్తు తత్ర తత్ర ప్రదృశ్యతే.
—అథర్వ. అజన్త. ౬౩.

సస్యవాచకశబ్దంబులును
—ప్రౌఢ. శబ్ద. ౨౯ సూ.

తెలుచుగ ధాన్యవాచక శబ్దములును,
—ప్రౌఢ. శబ్ద. ౩౮ సూ.

(౫)

శ్లో. అర్థభేదే క్వచిచ్ఛబ్దాదిగా స్యాన్తు తతో౽పి డుక్,
సామంత్రణే డుక్ హ్రస్వ స్స్యాత్ బహుతా
త్వత్ర నేష్యతే. —(అథర్వ. అజన్త. ౮౧ శ్లో.)

తెనుఁగునం గొన్నితత్సమదేశ్యశబ్దములకం టెం బరంబుగ నేకవచనంబున నీచత్వద్యోతకంబయి 'ఇగా' యను నొక్క శబ్దంబును దానిపై డువర్ణకాదులునుం జూపట్టెడి. సంబోధనంబున డువర్ణకంబు చూపట్టదు. తుది దీర్ఘంబునకు హ్రస్వంబు వైకల్పికంబు.

—ప్రౌఢ. శబ్ద. ౨౨ సూ.

(౬)

శ్లో. క్వచి దామంత్రణే కానో వైకృతా త్పరతో మతః.
—అథ. అజన్త. ౮౨.

దేశ్యంబులం గొన్నియెడల స్త్రీవాచక స్త్రీసమంబులగు సంబోధ్యవాచకశబ్దంబులమీఁద నేకవచనంబునఁ గానశబ్దం బొందును, అలయును నవ్యయం బొందునుగానం బడియెడి; అలదీర్ఘాంతమునగు.

—ప్రౌఢ. శబ్ద. ౧౫ సూ.

(౭)

శ్లో. పూజ్యత్వేన ద్రుతః కారుః
ఫేదకంతూధయాత్మకః;
తచ్ఛబ్దస్యాన్ష స్తహుత్వే స్యా
త్తథా తత్ర ద్రుతస్థితిః.
—అజన్త. ౮౩ శ్లో.

తెలుచుగా స్త్రీసమంబులగు దేశ్యశబ్దంబులకుఁ గడపలఁ గొన్నింటికి నేకవచనంబునం బూజ్యతయందు గారుశబ్దంబగు. —ప్రౌఢ. శబ్ద. ౩౯ సూ.

డుమంతంబులగు తత్సమాదిశబ్దంబులకుం గొన్నిటికి ద్వితీయా బహువచనంబుమీఁదం బూజ్యతయందు గారునకు మాఱుగ వారగు.

(ఇంచుకంత సవరణము)—ప్రౌఢ. శబ్ద. ౪౧సూ.

(౮)

డశావాచకే స్య తు న్న్యంతతా తత్ర దృశ్యతే.

—అథర్వ. అజన్త. ౬౫ శ్లో.

అమహదర్థంబున భిన్నవస్తుసముదాయం బర్థము
నీకవచనంబున నంతాదుల తకారంబునకు ద్విరు
క్తంబగు. —ప్రౌఢ. శబ్ద. ౫౨ సూ.

(౯)

దశాదిసంఖ్యాయా మునోదుశ్చ పబిందుకః;
క్వచి దుపాన్త్య మాదేశ స్స్యాత్తథానతా.

—అథ. అజన్త. ౮౬. శ్లో.

ఒకండ్వాదులు పరంబులగునప్పుడు ఁదియుగ మున్

—ప్రౌఢ సమాస. ౨౨ సూ.

దికి రెండిరుదొమ్మిదులు బరంబులగునపుడు
ర్వక డకారంబును ద్విరుక్తనివర్ణంబును బిందు
పంబుగ దివర్ణంబున కగు.

—ప్రౌఢ. సమాస. ౨౩ సూ.

(౧౦)

తుల్యలకసంబంధో
ష్యత్రనాహితకృద్భవేత్.

—అథ. అజన్త. ౯౩ శ్లో.

ద్యంబునకుఁ గులకంబగు.

—ప్రౌఢ. వాక్యపరిచ్ఛే. ౨౩ సూ.

టు సుథీమాత్ర ఉదాహరణము తుల్యము.)
(తా నొకొండు పండు చెచ్చెరన్) ఇత్యాది.

(౧౧)

ృతుగాదిచతుర్వర్ణపర్యంతం జనవాముసు;
స్స్యా ద్వ్యతి వర్ణానాం శబ్దే రాజాదికే పరే.
త్వం క్వచి చ్చాత్వం క్వచి ఠత్వం క్వచిత్పతా;
ర్మత్వం యథాయోగ మన్యచ్చ వ్యవహారతః.

—అథ.

కర్మధారయంబు విరుదాద్యుత్తరపదంబయ్యె
నేని ద్వ్యత్వరాదంత స్త్రీపుం సంజ్ఞావాచకంబగు పూర్వ
పదంబు నంత్యాక్షరంబున కంతట దీర్ఘంబు బహుళం
బుగా నగు. —ప్రౌఢ. సమాస. ౨ సూ.

(ఇంచుకభేదము.)

(౧౨)

శ్లో. క్వచి న్నవర్ణే డేర్లోపః క్వచి డ్డోశ్చ తథా భవేత్;
క్వచి త్తదర్థే డయుగం క్వచి న్నస్యేచ్చ లోపవాన్.

—అథర్వ.

ఒకానొకచోఁ దద్ధర్మార్థకంబులగు నుండు, దను,
గరుకొనులు ప్రశ్నార్థకాకారపరకంబులగునపుడు వాని
కడ యచ్చులకు లోపంబు విభాషనగు. అగుచో నుండు
డకారంబునకు నకారంబగు.

—ప్రౌఢ. క్రియా. ౭సూ.

(౧౩)

శ్లో. క్వచి త్సమాసాంతగస్య శబ్దస్యాదావపి స్థితిః.

ఉదా. విన్నకన్నవారు,-(అథ.హలన్త. ౧౭ శ్లో)

ద్వంద్వంబునం బూర్వపదాంత్యావయవంబునకు
లోపంబొండెయగు. —ప్రౌఢ. సమాస. ౩౭ సూ.

(౧౪)

శ్లో. ద్వంద్వం కేషాంచి దిష్ట స్స్యాత్త్వార్థశబ్దేన కుత్ర
చిత్. —అథర్వ. హలన్త. ౧౭ శ్లో.

భావ ద్వంద్వంబునం దొలిపదంబు టవర్ణంబునకు
లోపంబగు. —ప్రౌ. సమా. ౩౧.

(ఇటమాత్రము కొంత మార్పుకలదు.)

(౧౫)

శ్లో. ప్రార్థనార్థే భవే న్నాన్తా త్కుదేత్యర్థ విశేషతః.

అథ. క్రియా. ౧౪ శ్లో.

ప్రార్థనంబునం దన్వత్యయాంతక్రియలమీఁదఁ
గదకదవుపూర్వకంబు లన్నారు లనుప్రయుక్తంబునగు.

—ప్రౌఢ. క్రియా. ౯ సూ

ఈ విధముగ వికృతివివేకస్థ గ్రంథస్థవిషయములను గొన్నిటిని స్వీకరించుచుఁ గావలయు నన్నమార్పులు చేయుచుఁ బ్రౌఢవ్యాకరణ కర్తలు స్వీయగ్రంథమును బెంపొందించిరి.

ఇది యిట్లుండ బేరులోని త్రిలింగలక్షణ పదమునకు ఆంధ్రభాషలోఁ దల్లాక్షణిక విషయములను జర్చించియున్న గ్రంథములని యర్థమనియు,వాని కీప్రౌఢవ్యాకరణము శేషగ్రంథమనియు నందురేమో! అదియును బొసఁగి యుండలేదు.

కారణమేమన పూర్వోక్తగ్రంథములలోఁ జేరియున్న "కవిసంశయవిచ్ఛేదము" మున్నగు లాక్షణికగ్రంథములయం దుక్తములగు నంశములనే కొన్నిటిని ప్రకృతగ్రంథకర్తలు ముచ్చటించియున్నారు. అవియును నీక్రింద స్థాలీపులాకన్యాయముగ నుదాహృతము లైనవి.

(౧)

క. మనమునను, మనమునం దన
మనమునయం దనఁగ మఱియు మనసందనఁగాఁ
దనరారి పెక్కుతెఱఁగులఁ
బనిగొను నీసప్తమీ విభక్తులు కృతులన్.
—కవిసంశయవిచ్ఛేదము. ౨వ తరంగము. ౭౫ పద్య.

ఉదంతంబు లగు సమహత్తుల కందువర్ణకము పరబగునపుడునవర్ణకంబగు. —ప్రౌఢ. శబ్దం. ప. ౨౧సూ.

(౨)

తే. తోడఁతియాంధ్రవిభక్తులతోడఁ గలసి
సంస్కృతసమాసములు కొన్ని జగతిఁ బరగు
సిరభుజబలంబున జితత్రిపురుషుఁ డంబి
కామనోవల్లభుం డను కరణిధరణి.
కవి సం. ద్వితీయ తరం. ౧౪ పద్య.



కొన్నియెడల సిద్ధసమాసమధ్య గతపదంబులతోఁ దద్భిన్నపదంబుల కన్వయంబుచూపఁబడెడి.
—ప్రౌఢ. సమాస. ౩౫ సూ.

(3)

తే. ఎఱుకఁగలవారె యనుచోట నెఱుకగలరె
యిట్టివారె యనెడుచోట నిట్టిరెయను
సేయఁగలవారె యనుచోట సేయఁగలరె
యనుచు, లోకప్రసిద్ధోక్తియగుట శర్వ!
—కవి సం. ద్వి. తరం. ౧౦౧ పద్య.

అట్టి, ఇట్టి, ఎట్టి విశేషణంబుల మీఁది తచ్ఛబ్దవకారంబునకు లోపంబు విభాషనగు.
—ప్రౌఢ. సమా. ● సూ.

(౪)

పురమునందలివారని పొసఁగ బలుకు
నెడఁబురంబునవారని యిడఁగవచ్చు.
—కవి. ప్రథ. తరం. ౧౨౪ పద్య.

షష్ఠీతత్పురుషంబులందు నగాగమంబు విభాషనగు. —ప్రౌఢ. సమాస. ౧ సూ.

(ఉభయత్ర ఉదాహరణములు తుల్యములు)

(౫)

క. అగునను క్రియతోఁ బాసియుఁ
దగుఁ బెక్కువిభక్తులం బ్రథమఁ జెందును భ
క్తగణదయామానచిత్తుం
డగజాధిపుకీర్తి దిశల నలమె ననంగన్.
—కవి. ప్రథమ త. ౪౩ పద్య.

ఒక్కచో సమాసాంతర్గత విశేష్యంబులకగు విశేషణంబుల షష్ఠికిని బ్రథమ చూపఁబడెడి.
—ప్రౌఢ. కారక. ౨౧ సూ.

ఇట్లే అన్యము లనేకములు.

ఈ తీరునఁ బ్రౌఢవ్యాకరణకర్త పెక్కువిషయము లన్యగ్రంథములనుండి గ్రహించి

...డ యథాతథముగ మఱియొక్కచో
...ంతరేణ వివరించుచు వ్రాసిన గ్రంథము
...గలక్షణశేష" మెట్లగును?

...కాని యొకవేళ వికృతివివేకగ్రంథాదు
...ప్రౌఢవ్యాకరణ కర్తలు చూడలేదం
...! అది యసంగతము.

...నయో ప్సంగతిం యస్తు కరోతి కవితా కృతౌ,
...స్య అత్యంతదోష శ్చాన్ ధ్రువం కవి స్సహి కథ్యతే.

అను ద్వితీయాచార్యుల వాక్యమును
...గ్రంథకర్తలు ప్రత్యక్షముగ స్వీయగ్రంథ
...నుటంకించిరి.

ఇదియును గాక అథర్వణకారికల నా
...ందర్భముల నడుకుచు నహోబలపతిపండి
...ాంధ్రశబ్దచింతామణికి వ్యాఖ్యానము
...ియుండిరిగదా. అట్టి గ్రంథవిషయమై:

...అకంతుడుబహువ్రీహి —యా సం. ౯ సూ.

...సి నహోబలపతి పండితుఁడు మిశ్రబహువ్రీహి
కాని యట్లగుట దుర్ఘటంబు.

...ఢవ్యాకరణకర్తలే అహోబలపతిగ్రంథ
...నిరసించియున్నారు.

...కొఁ ప్రకృతగ్రంథమున సామాన్య
...జూడ నూతనముగ రచింపఁబడినవి
...్యాకరణశేషవిషయములు కొన్నిమా
...చిన్నయసూరిగారు తమ వ్యాకరణ
...బూర్వగ్రంథప్రతిపాదిత విషయముల
...ులను ఆదరణీయప్రయోగ బాహు
...లేమిచేతనో, మఱి యేయుద్దేశముచే
...యుపేక్షించుటయు, ఖండించుటయు సం

భవించినది. అట్టి యుపేక్షిత, ఖండిత విషయ
ములను మాత్రముఁ గొన్నిటినిఁ బ్రకృతగ్రంథ
కర్త లవధానమున నుద్ధరించుచు వివరించి
యున్నారు.

## ఉపేక్షిత విషయములు

(౧)

రోశబ్దం బొండు, సంబోధనంబున స్త్రీవాచకం
బునకుఁ బరంబుగనగు. —ప్రౌఢ. శబ్ద. ౧౪ సూ.

(౨)

శ్లో. దీర్ఘ హ్రస్వ ద్వర్ణ నిర్దేశే ప్రత్యయేఽన్యత్ర చ క్వచిత్;
కేషాంచి త్ప్రత్యయే నేప తత్ప్రయోగస్తు సమ్మతిః.
—అథర్వ. అజ న్త. ౮౪ శ్లో.

నిర్దేశవిధానోచ్చారణంబులం దఱచుగ నవర్ణాదు
లుకారప్రత్యయాంతంబులును, రవర్ణమిథ ప్రత్యయాం
తంబును నగు. —ప్రౌఢ. సంజ్ఞ. ౨ సూ.

ఒకచో హ్రస్వంబు, దీర్ఘంబగు.
దీర్ఘంబు దీర్ఘంబ. —ప్రౌఢ.

## ఖండిత విషయములు

శ్లో. గ్రామ్యం తత్త్రిద్విధా సాధు కలకంఠముఖాహితాః.
—అథర్వణుఁడు
—(అథ. సంజ్ఞా. ౨౯ శ్లో.

లక్షణవిరుద్ధంబగు భాష గ్రామ్యంబు.

ఈభాష ప్రయోగమున కనర్హంబు. బాలవ్యా
కరణము. —(సంజ్ఞా. ౨౨ సూ. బాలవ్యా.)

ఇట నీయుభయ విషయములను గాంచి
ప్రౌఢవ్యాకరణ కర్త

"గ్రామ్యంబు తత్తజ్జాతివర్ణంబునం బ్రయోగా
ర్హంబగు"
అని సవరణరూపముగ సూత్రించియున్నాఁడు.

ఈ విషయము లిట్లుండఁ బకృతగ్రంథము కేవలము "బాలవ్యాకరణశేష"మని యనుటయుఁ గొన్ని యెడలఁ బొసఁగదు. బాలవ్యాకరణసాధితరూపములను దదుద్దిష్టవిషయములనే ప్రకృతగ్రంథమునఁ గొన్నిటిని గ్రంథకర్తలు పేర్కొనియుండిరి.

అన్ని మొదలగు శబ్దము లొఱును ద్విప్రభృతి సంఖ్యావాచకంబులును, మహదర్థంబులును బహువచనాంతంబులగు—

అని బాలవ్యాకరణము చెప్పియుండ

అందఱ్వాదులు నిత్య బహువచనాంతంబులు.

ప్రౌఢ-శబ్ద. ౩౪ సూ.

అని ప్రత్యేకతః ప్రౌఢకృతి వర్ణించియున్నది.

జడ్డక్కరంబుతోఁ బదాదిస్వరంబు గూడుచో జడ్డకు లోపంబు లేదు.— బాల. ప్రకీర్ణ. ౯ సూ.

యెద్దియో నూతనవిషయమన్నట్లు,

"ద్విత్వరహితంబగు ద్వితీయావిభక్తి యుకారమున కచ్చు పరంబగుచో సంధి రాదు.—

ముక్తలక్షణ వివేచనము.

అని ప్రౌఢవ్యాకరణకర్త వ్యర్థముగఁ జెప్పవలసివచ్చె.

ఈ విధముగఁ గొన్నిపట్టులమాత్రము జూచినచో, ప్రకృతగ్రంథము "బాలవ్యాకరణశేషగ్రంథ"మనుటకును జంకు కలుగుచున్నది.

ఇఁక నేతద్గ్రంథమునకుఁగల "ప్రౌఢవ్యాకరణ"మను నామాంతరమును గూర్చియు నొకింత ముచ్చటింపవలయును.

గీర్వాణభాషయందు, 'బాలమనోరమ' యను గ్రంథమునకు "ప్రౌఢమనోరమ" యను గ్రంథముండిన ట్లుండవలయునని తలఁచియుం దనకాలమున బాలవ్యాకరణమునకు మిక్కిలి ఖ్యాతియుండుటం జేసి దానికిఁ బ్రతిద్వంద్విగనుం డవలయునని భావించియు నేతద్గ్రంథకర్తలు ప్రౌఢపదవిలసితనామధేయమును స్వీయగ్రంథ మునకు నెలకొల్పిరి. కాని సూత్రఘటనాసామ ర్థ్యంబునను, గ్రంథప్రణాళికా నిపుణతయం దును, రవ్వంతేనియు బాలవ్యాకరణమునకు సరిరాదు కదా ప్రౌఢత్వ మించుకంతైనను గానరాదు.

ఇఁకఁ బ్రౌఢత్వమన్న పూర్వవ్యాకరణ ముల నుదాహృతములు, సాధితములు గాని ప్రౌఢప్రయోగములను మాత్ర మనేకములను బ్రకృతగ్రంథము సాధించి, యేతద్రూపప్రౌఢ తను మాత్ర మాపాదించుకొనియున్నదని చెప్పవచ్చును.

ఈ క్రమముననే గ్రంథమున కుంచిన నామద్వయమును నేతిబీరకాయ చందముగ వెలసియుండుటం జేసి, దానికి సన్వర్థతను సం పాదింప నయితికాదయ్యె.

కాని నామకరణ మెట్లున్నను వస్తు వా దరణీయమైనచోఁ జాలదా? యని యందు రేని ఆ విషయమున మీకన్న ముందుగ మేమే తల యూఁప సంసిద్ధులము.

ఆంధ్రపండితులు కేవలము సంస్కృత వాసనా పటిమచే "ప్రయోగమూలం వ్యాక రణమ్; ప్రయోగశరణా వైయాకరణాః" యను మాటలను మఱచి, సంస్కృతవాఙ్మయము

గాం(థమును వ్యాకరణముచే సాధింపవల ు సభినివేశముతో భారతేతర(ప్రయో కనాదరము చూపియుండ నయ్యాది గతమని భావించి భాషావ్యాకరణము ల సంబంధ మరసియున్న వాఁడగుటచేఁ (గంథకర్త ఆదరణీయ(ప్రయోగము ుత్యేకతః చూపించుచు, వానికి సూ(త్ర హ(త్రించుచు, నూతనమార్గమును నైపు గఁ (ద్రొక్కి, యాదరణీయుఁడు, చిరస్మర డు నయి యుండుట సిద్ధము.

పూర్వవ్యాకరణములను బఠించినవారల కీ (గంథమును భాషయం దెంతయో (ప్రవేశ మిప్పించి, వాఙ్మయజ్ఞానమునకుఁ జేయూఁత యొసగుచుఁ, గర్తృతావిషయమున విశేష (ప్రయాసమునకు లోనైన యేతద్గ్రంథకర్తల గౌరవాధిక్యమును (బకటించుచు రాణించుచు న్నదని భావించి పాఠకమహాశయులను విష యాంతరమునకుఁ బోవ నభ్యనుజ్ఞ నర్థించు చుంటిని.

---

# చిత్ర నాటకము

పురిపండా అప్పలస్వామి గారు

అనుదినమ్ము నీ విపుల నాట్యాలయమున
సరిగ వేళకు తెరఁదీసి తెరను వాల్చి
అర్థమే కాని నాటక మాడు చుందు
వోయి నాటకసూ(త్రధారీ! యిదేమి!

కల్పము లతీత మైపోవుఁ గాని నాట
కమ్ముమా(త్రమెన్నఁడు సమాప్తమ్ము కాదు
కడచు రంగమ్ము వెండియుఁ గంటపడదు
చనిన పా(త్రల కిఁకఁ (బవేశమ్ము లేదు
తవిలివచ్చు వారలకు నంతమును లేదు
ఎవరి మెప్పింప నెంచొఁక నీ యనంత
చి(త్రనాటక మిటు (ప్రదర్శింతువోయి!

---

చెను. శ్యామసుందరుని కలుసుకొనిన తత్క్షణమే
వెళ్ల నిశ్చయించెను.



యీవాయుత్తరము పోస్టాఫీసున కిచ్చివేయుము."

* * * *

ఇందిర తన కన్నవారియింటికేగి తల్లిపాదముల
...మత్తవారియింటికి వెంటనే బయలుదేరెను.
...ందరు డెట్లు మోసపోయెనో యెరిగింపుచు
...ందిర పరిహాసోక్తుల నుంచుచున్న సమయమున
డక్కడకు వచ్చి చేరి యాతని గాఢాలింగన
...చెను. శ్యామసుందరు డాతని తిరిగి కౌగలించి
...ం గ్రహించి కన్నీళ్లు జార్చెను. మోహనునితో
వెళ్లి తిరుపతిప్రయాణమునకై యాతని పురికొ
అంగుళీయకము తన పట్టు చేరుమాలున జుట్టి
... చేయిపట్టి "మోహనా! నామాటయొకటి
...ు. నే నీయంగుళీయకమును బంపితి"నని
...రిగింపుము. అంగుళీయకము భ్రమర పేరను పంపు మని నగలవర్తకునికి వ్రాసితిని. ఇప్పటికి నామె నీవే దానిని బంపితివని తలంచియున్నది. ఆయభిప్రాయము మాత్రము నీవు తప్పింపకు. నేనెట్టి దురభిప్రాయమునను దానిని బంపలేదు. నేను నీవు క్షమింపగలవని యెరుంగుదును. కాని భ్రమరకు తెలసిన నన్ను క్షమింపదు. నేనామె విషయమున మోటుగా ప్రవర్తించితిని."

మోహను డందులకడ్డువచ్చి "నేను నిన్నుచాల నవమానపరచితిని. అట్టి ప్రియమిత్రునియందు నాకు విశ్వాసము లేకపోవు టెట్లు? నాకు నిన్నుగాంచ సిగ్గగుచున్నది." అని గద్గదస్వరముతో బలికెను.

* * * *

శ్యామసుందరుడు రైల్వేస్టేషనువరకు మోహను ననుసరించెను. మోహనుడు బండియెక్కెను. అతడు తిరుపతి చేరినవెంటనే భ్రమరయున్న గదికేగెను. ఆమె విచారావస్థగాంచి యాతురతతో నామెను కౌగిలించి



"భ్రమరా! చిన్నచిన్న నేరములు క్షమింపబడనలెను. తిరుపతి వేంకటేశ్వరుడు మనల నొక్కటి చేయుగాక" యని పలికెను.

# దశరథనిర్వేదము

శ్రీ వేంకట వీరరాజకవులు

దశరథునకుఁ బట్టముం గట్టువాఁడ, రామ-భద్రుఁ గాన కంపఁగఁ గోర వల దటంచు
నెంత వేఁడిన కైకేయి స్వాంత మెట్టి-కఠిన పాషాణ సదృశమో కరఁగ దయ్యె!

"అదె యిదె రాఘవుం బనుప యాగముఁ గాచి నిశాచరావళిం
గదిసి వధింప" నంచు నల గాధి సుతుం డనఁ, గొన్నినాళ్ళకే
మదిఁ గలఁతన్ వహించితిఁ గుమార వియోగ భరాన, నిత్తఱిన్
బదియును నాలు గేఁడు లెటు వాసి చరించెద రామచంద్రునిన్!

"తనయుఁడ, నీకు సర్వ వసుధాస్థలిఁ బట్టముఁ గట్టెదన్ వడిన్
గొనుచుఁ ద్వదీయ వృద్ధజనకుం బరితృప్తు నొనర్పు" మన్ననో
టనె పదునాలుగేఁడు లకటా! 'వనులందు వసింపు' మంచు ని
న్ననఁ గలనా! నితాంత కఠినాత్ముఁడ నై రఘురామచంద్రమా!

పొడమినదాది నిన్నుఁ బరిపూర్ణముదంబున నాదు కన్నులం
దిడికొని పెంచి, నీ శుభములే నిరతమ్ము మదిం దలంచి, ఈ
పుడమి సమస్త మేలు దని పొంగుచు నుంటిని గాని ఇట్లు నీ
వడవులపాలు గావలయు నంచు గణింపఁగనైతిఁ బుత్త్రకా!

నారచీరలు దాల్చి దైన్యమున రామ-చంద్రుఁ డరుదెంచి ననుఁ గాంచి, "జనక! కాన
కరుగుచున్నాఁడ దీవింపు" మనిన నేమి-పలుకఁగలవాఁడ! తనయుని పాటుఁ గాంచి!
ధారుణీభార మూన నుత్తరు వొసంగ-వేఁడుటకు మారు తల్లి నీరేడువత్స
రములు వని కేఁగ వేఁడిన రాముఁ గాంచి-కలఁగు కౌసల్యశోకమ్ముఁ గాంచఁ దరమె!

మాయురే! ఒక్క-నిమిసంబుఁ బాయరాని-రామచంద్రు వియోగకారణముఁ దలఁచి
దినదినంబు కృశించు సతీలలామ-సీత నేఁజూడ నింక వీక్షింప నగునొ?

"పట్టభద్రునిఁ జేయవలె రాము"నని యిట్లు-సల్పెదే యంచుఁ గౌసల్య నుడువ
"ప్రథమసూనుని మాని భరతునా పట్టాభిషిక్తుఁ జేయుఁ" దని వసిష్ఠుఁ డడుగ
"ఏదోష మెంచి సహోదరు వని కంపఁగా నెంచి"తంచు లక్ష్మణుఁడు పలుక
"కైక మాయలఁ జిక్కి లోకైకవినుతు నిట్లొనరింతురే" యని జనము లనఁగ
నేమి ప్రత్యుత్తరమ్ము నే నిడుదు! పూర్వ-జన్మమున నెట్టి పాపంబు సలిపినానొ
ఎట్టివారికిఁ గాని మహీతలమున-కర్మ మనుభవనీయంబు గాకపోదు!

# ...త్యాయము

వేలూరి శివరామశాస్త్రి గారు

౧

శ్రీగహారీకుఁడైన నరసింహులుకు మొదటి
నుండియు మాలకాటఁడు పాలేరు. ఇపు
...రికి ఎనుబదేండ్లు.

కాటఁడు నమ్మిన బంటు. నరసింహు
...దొంగలు కొట్టినపుడు కాటఁడు ఆ దెబ్బ
...యు తానే తినెను. పని పట్టినపుడు పలు
...లు ముసురు రేలలో కాఁడవుల పయి
...దొరకార్యములు సాధించెను. ఊరంతయు
...పోవుచున్నపుడు తన శరీరము కాలినను
...గొనక దొరయిల్లు కాపాడెను. అతఁడు
...దొరమీఁద ఈఁగను వాలనీయలేదు.

నరసింహులుకూడ కాటని కష్టములలో
...డెను. పెండ్లి పేరంటములు చేసెను. ఇల్లు
...పెట్టెను. అన్నవస్త్రము లిచ్చెను. ఇటులు
...వలన పాలేరును పాలేరువలన దొరయు
...వృద్ధి చెందిరి.

ప్రాయము చెల్లినపయిని దొరకు
...లను కొడుకున్న పాలేరునకు రాముఁ
...కొడుకును గలిగిరి; కాని పాలేరు పెం
...ప్రసవించి మరణించెను. నరసింహుల
...లమున కాటఁడు మరల లచ్చి యను
...పెండ్లాడెను. పెండ్లాడిన కొద్ది రోజు
...జబ్బుపడెను. అసలే వృద్ధాప్యము. అందులో

ఒకనాఁడు దొరయింటికి నలుగురు
సాయమున అతికష్టముగా నడిచి వెళ్లెను. ఎదు
రుగా దూరమున కూర్చుండెను.

సోములు— ఛీ చండాల దర్శనము
పోండు! దూరముగా పోండు! అనెను.
కాటఁడు దూరముగా తొలఁగి తొలఁగి
కూర్చుండెను.

గదిలో జ్వరశయ్యలో నున్న నరసిం
హులు—ఏమిరా నాయనా! ఏమిటీ? అనెను.



మాలఁడు భక్తిపూర్వకముగా గల సేల వేసెను

ఊహూ వింటివా? పాము చెవులు! ప్రొద్దున నే
కాటఁడు, మధ్యాహ్నము కాటఁడు, సాయం

* ఇట్టి వాడుకమాటలు ఇందు ఉపయోగింపఁబడినవి.

కాలము కాటఁడు, ముందు కాటఁడు, వెనుక కాటఁడు, కాటఁడు, కాటఁడు! ఎందులకు వచ్చిన బ్రాహ్మణ్యము! అని సోములనెను.

నరసింహులు కఱ్ఱగొని వాకిటికి వచ్చి అరుఁగుపై కూర్చుండెను. మాలఁడు భక్తిపూర్వకముగా తల నేల మోపెను. బ్రాహ్మణుఁడాశీర్వదించెను. ఒకరి నొకరు ఆరోగ్యమును గుఱించి ప్రశ్నించుకొనిరి.

కాటఁడు— దొరా! ఇఁక నేను జీవింపఁగల ననుకొనను. వేదన ఎక్కువగా ఉన్నది. నా కిఁక స్వామిసేవ తీఱిపోయినది. అనెను.



కాటఁడు...నరసింహులయెదుట ఒక మూటను విప్పెను

నరసింహులు కంటినీరు పెట్టుకొని— కాటా! నేనును చిన్నవాఁడనుగాను, నేఁడో రేపో నా పయనమును సునిశ్చితము. దాని కేమి? నీ విఁక దుఃఖింపకుము. నారాయణ స్మరణ చేయుము. అనెను.

అదియే ఉపదేశముగా కాటఁడు నారాయణ మంత్రమును గ్రహించి తన కొడుకును దక్క తక్కఁగల బందుగుల ద్వారముగా పొమ్మని నరసింహులయెదుట ఒక మూటను విప్పెను. నూఱు అఱకాసులు. వాని జూపి— అయ్యా! ఇది తమకడ సంపాదించినది. నా కొడుకు ఇఁక నవతి కొడుకు, అక్కఱలో తమరు విచారించి వానికి ఈయఁగోరుచున్నాను! అని మనవి చేసెను.

నరసింహులు కుమారుని బిలిచి ఆ ధన విషయము చెప్పి భద్రపఱిపించెను. కాటఁడు ముమ్మాఱు మ్రొక్కి సెలవుగొని నారాయణ స్మరణము చేయుచు వెళ్ళిపోయెను.

దొర అచటనే కూర్చుండి పలుమాఱులు ఆవలించెను. నరసింహులకు అదియే తుది సెలవుగా కానిపించెనా? అతఁడు నిట్టూర్చి ఆకాశము చూచుచు కూరుచుండెను. అతని కేమియు తోఁపలేదా? ధనముకన్న విలువగల పదార్థ మేమైన పోవుచున్నదా? ఔను. తానును అతఁడును ఒకరి వెనుక నొకరు దున్నిరి. పాండ్రపొలములను సుక్షేత్రములుగా మార్చిరి. రాత్రి చేని గట్లమీద ఒకరివెనుక నొకరు పరుండిరి. నీరు కట్టిరి; కోసిరి; కుప్పలు వేసిరి; నూర్చిరి. అక్కఱలో సంచులు సాయము పట్టి బండ్లకెక్కించిరి. వారికి ఇండ్లదగ్గఱనే దవ్వు. పనిలో ప్రేమలో ఒకటే చెయ్యి; ఒకటే మనసు.

కాటని బాహుబలమును, దానికన్న
ంగు విశ్వాసమును తన భాగ్యమునకు
ు. ఆ భాగ్యముచేతనే తాను బవంతి
కాటనికి పూరిల్లు వేయించెను. తాను
ను. కాటనికి పెండ్లిండ్లు చేయించెను.
ముచేతనే తన కుమారునికి చదువు
ను; రాముని కిరస్తానిబడిలో చదివిం
ట్టి కాటఁడు తనకడనేకాక ఇహాలో
సెలవుగొని పోవుచుండఁగా ధనము
ువగల ఒకానొక పదార్థము తనను
పోవుటలేదా?

ఁకటిపడిన తరువాత నరసింహులు
నఁబోయెను. ఆముదపు దివ్వె వెలుఁ
ని కాయమును నరసింహులు కాం
త్రోప దుఃఖములు ఒకే తూరి.

చ్చి నా గతి యేమి యని నేలకు
చ్చెను. రాముఁడు దొరగారు వచ్చి
ో అఱచెను. కాటనికి స్పృహ లేదు.
లు జ్వరబాధచే వణఁకుచు వెను
ను.

సింహులు తన ఆస్తిలో మూఁడవ
ని కొడుకు రామునికి విల్లు వ్రాసి
లిపించి యిచ్చెను. రాముఁడు దానిని
దాఁచ నిచ్చెను.

ృహా వచ్చినపుడు దొరకును శాస్త్రే
నారాయణస్మరణము తక్క వేఱు
. శ్మశానాగ్నిలో మంటవెలుఁగున
్య లిరువురును ఒకరి నొకరు
ుచు పరలోక మేఁగిరి.

౨

సోములు హైస్కూలులో స్కూలు ఫయినలుదాఁక చదివెను. ఆ హైస్కూలు వైదిక ట్రస్టీల చేతులలో పెరిఁగెను. దాన ప్రతి విద్యార్థికిని మతవిభాగమున సనాతన ధర్మములు, ఇంగ్లీషు టీకతో గీత పఠనీయములు. విభూతి, బిళ్లగోఁచి మొదలగునవి విధులు కావుకాని ఆదరపాత్రములు. సోములు వీనిని ముఖ్యముగా అనుష్ఠించెను. దిగువ తరగతులలో గెలుపొందెనుగాని స్కూలు ఫయినలు అతని దారిలో కొండవలె అడ్డుదగిలెను. తండ్రి గతించిన పదఁపడి చదువుటకు తీరిక లేక మానివైచెను.

బ్రాహ్మణునకు సేద్యము పాడి గాదని సోముల మతమే కాని రాఁబడిని చూచి ఎత్తివేయలేదు. ఒకటి రెండు సంవత్సరములు అతిక్రమించిన పిమ్మట తాను చెప్పిన కూలినాలికి ఎవరును రాకుండుట వలనను తన ఆచారమునకు మాలమాదిగలు పనికిరాకుండుట వలనను, 'శూద్ర స్సర్వస్య ఘాతకః' అని శూద్రునం దిష్టము లేకుండుటవలనను, విశేషించి తాను కష్టపడలేకుండుట వలనను వ్యవసాయపు కామాటము ఎత్తివేసెను.

రాముఁడు వచ్చి గోడచాటున నిలువఁబడి అయ్యా తమ తండ్రిగారికడ చిన్ననాటనుండియు నాతండ్రి పాలేరు. వారి రెండు స్థానములందు మనమున్నాము. మానాయన విశ్వాసమే నాకును గలదు. అదియు తమకు

విదితచరము. ఆ దయనే తమరు నా యందు ఉంపుఁడు. నేను వ్యవసాయ మంతయు చేసె దను. మీరు లోటుపాటులు సవరించుకొను చుండుఁడు. అని మనవి చేసెను.

సోములు—ఏమీ? 'వారి' 'మనము' 'మా నాయన'? చిత్తము దేవర యాజ్ఞ! శ్రోత్రిశ్రోత్రి! శ్రోత్రిశ్రోత్రి!!! చండాలుఁడు నాకు చెప్పుట?

రాముఁడు—అయ్యా! ఒప్పో తప్పో చెప్పితిని. తమకు ఇష్టము లేనిచో పోనిండు! విల్లు నాకు దయచేయుఁడు. నా కిచ్చిన పొల మును పాలుకిచ్చితిరి. దానినే ఖాయపఱిచి



నా అనుమతి లేకుండ విల్లు వ్రాయుటకు
నా తండ్రికేమి హక్కు?

ఆ అంబారము నా కిప్పింపుఁడు. కాదందురా ఈయేఁడు తమరే తీసుకొని ముందటికి నాకు విడుదల చేయుఁ డనెను.

సోములు—ఏమిరా? నా అనుమతి లేకుండ విల్లు వ్రాయుటకు నా తండ్రి కేమి హక్కు? దొంగలూ దొంగలూ కలిసి ఊళ్ళు పంచుకొనిరఁట! చాలు నీమర్యాద. నీ మొగము చూడరాదు. ఛీఛీ లేచి పో! చేతనగుచో వ్యవహారము చేసికో. మరి మాటాడకు. అని లోపలి నుండి విల్లు తెచ్చి ముక్కముక్కలు చేసి వానిమీద పాఱవైచెను. మరి రెండు కొట్టి లోనికిఁ బోయి తలుపులు మూసికొనెను.

రాముఁడు ఆ కాకితపు ముక్కలకేసి చూచుచు చాలసేపు నిలువఁబడెను. నిలువఁ బడి నిలువఁబడి ఆ ముక్కల నన్నిఁటిని పోగు చేసెను. ఆతఁడు రొండి తడుముకొన లేదు. చుట్ట కాల్చఁడు కాన అచట నిప్పుపెట్టె ఉండదు. ఇంటికి పరువున వెళ్లివచ్చి ఆ ముక్కల ప్రోవు నకు నిప్పుపుల్లగీచి అంటించెను. అది నిమిష మాత్రమున కాలిపోయెను. రాముఁడు వెను దిరిగి చూడక వెళ్లిపోయెను. రయ్యిమని గాలి తోలి ఆ కాలిన ముక్కలు ఎక్కడి వక్కడ కొట్టుకొని పోయెను. అచట దాని చిహ్నము కూడ లేదు.

సోములు రాత్రి సగపడ భోజనమయిన వెనుక రివ్వున లేచి వాకిటికిఁ బరువిడెను. ఇటులు పరువెత్తుట పాతికేసారు లాయెను గాన భార్య భయపడలేదు గాని పిచ్చియెత్తెనేమో యనిమాత్ర మనుకొనెను. సోములు కాగితపు ముక్కలు వెదకెను. ఒక ముక్కయేని ఆ యంధకారమున గానిపింపలేదు.

ఈ లోపుగా భార్య లాంతరు గొని
ను. ఇపు డా వెలుఁగువ సోములకు మరి
ష్ట అంధకార మధికమే ఆయెను. అతఁ
ాశముదిక్కు చూచి పిడికిలించి విధవ! వాఁ
కొనిపోయినాఁడు. కానీ! కోర్టున్నది. వాఁ
ఁడు. ఈ యాస్తి వెల ఎంతయుండునో
యు వ్యయము చేయింపక దీనిని వానికి
నివ్వను అనుకొనుచు లోనికేఁగెను.

భార్య అనుగమించుచు 'మీరు విల్లు
తిరని నేరము రాదుకదా కొంప తవ్వి?'
ు.

సోములు అరుణనయనములతో, ఉబ్బిన
లతో అదరు ముకుతెమరలతో భార్య
చూచెను.

3

చ్చి యింటనున్న చెల్లెయు పుట్టినిం
కి నడపెను-ఇంటిపై నున్న కలప తప్ప.
ొడుకుతో కయ్యము పెట్టుకొనెను;
ు మాత్రము కిఁచులాడలేదు. కావున
పక్షములను తానే పోరాడెను.

రాముఁడు తల్లిని బతిమాలుకొనెను.
వినలేదు. ఇంటిలో సగమైన ఇమ్మని
పెట్టెను. రాముఁ డిచ్చెను. వా్రిత కోఁత
పిదప కుండయు కఱ్ఱియు తీసికొని
నితో చెప్పకుండ పుట్టినింటికి లేచిపో
కొలఁదినాళ్లకే లచ్చి యన్నఁదమ్ములు
ఆయిల్లు సోముల కమ్మివైచిరి.

రాముడు లోగడ అన్నము లేకపోవు
టెఱుఁగఁడు. వండుకొనుట అసలే యెఱుఁగఁడు.
రెణ్నాళ్లనుండి ఉపవాసము.

ఈ యవస్థయంతయు బడిలో అత
నితో చదువుకొన్న రెబెకా చూచెను. తలి
దండ్రులకు తెలియకుండ అన్నము తెచ్చి
నిద్రించుచున్న రాముని ముంగల పెట్టెను. పరి
కించి చూచి వెళ్లిపోయెను. ఆదారిని బోవు
ఫాదిరీతప్ప ఆవిషయము మితరు లెఱుఁగరు.

కొంతవడికి రాముఁడు మేలుకనెను.
అన్నముచూచి—ఆహా భగవానుఁడా! నా
యెడ నీ కెంత దయ! నా యాఁకలికూడ నీకు
తెలిసెనా? అనెను.

అతని కన్నులనుండి నీరు జల జల
రాలెను. వాకిటికి వచ్చి చూచెను. ఎవరును
లేరు. భగవన్నామోచ్చారణము చేయుచు
అన్నముముందు కూర్చుండి భుజించుచుండెను.
కంచె యావలినుండి రెబెకా రెండుకన్నులును
రామునిపై బడెను. రాముఁడును రెబెకాను
చూచెను. ఆచూపులో అన్నదానముకన్న
ఆత్మదాన మెక్కుడుగాఁ గానిపించెను. వినయ
పూర్వకముగా తలవాల్చెను. రెబెకా తలవంచి
చిఱునవ్వుతో లోనికేఁగెను.

రాముఁడు రెబెకాకు అన్నమిడు
నవకాశము మరల ఈయలేదు. కాని చూచు
టకు మాత్ర మీయకపోలేదు. రెబెకా రాముల
రహస్య ప్రసంగములను రెబెకా తలిదం
డ్రులు అవరోధింపలేదు. రెబెకా రాముని



(౧౨) కఱ్ఱ తెర



(౧౩) ౧౯౨౪వ సంవత్సరమున జరిగిన వెంబ్లి ప్రదర్శనమున ప్రదర్శింపబడిన కొన్ని సామానులు



(౧౪) నూకమాని కుర్చీ
దీనిని విడదీసి మరల కూర్చుకొనవచ్చును.



(౧౫) తాపడపు పనిచేసిన నూకమ్రాను బీరువా

కిరస్తాని మతమున కలియు మనెను. రాముఁడు కిరస్తాని మతమన నేమి యని యడిగెను. రెబెకా చెప్పలేకపోయెను. రాముఁడు లోతుగా చూచెను.

ఒకనాఁడు ఫాదరీ రెబెకాతండ్రి విశాఖను (Isaac) పిలిపించి-నీకుమార్తె రాముని ప్రేమించుచున్నట్లు నాకు తెలియును. దానికి నా ముద్దులు చెప్పవలెను. అయితే రాముని ఎంత వడిగా కిరస్తాని మతమున కలుపఁగలుగునో అంతవడిగా పెండ్లి చేసికొనవచ్చును. మీ రందఱు కలిసి ఏసు దయచే అతనిని వెంటనే మతమున కలుపుఁడు; పొండు. ఇదిగో, మతములో కలిసిననాఁడే వాఁడు పంతులు. నీకూఁతురు పంతులమ్మ. తెలిసినదా? అనెను.

ఈ వార్త తెలుపుటకు విశాఖ రాముని కడకు వెళ్ళెను. రాముఁ డాలోచించుకొనుచు కూరుచుండెను. విశాఖ రాగానే లేచి గౌరవించి కూర్చుండఁబెట్టెను.

నీవు వెంటనే మతము పుచ్చుకొనవలెనని విశాఖ. ఏల? యని రాముఁడు. పుచ్చుకొననిచో రెబెకా నీయ వీలులేదని విశాఖ. నేను గర్భదరిద్రుఁడను; మతమున కలిసిన మాత్రమున ఇత్తువా? అని రాముఁడు. ఆ మాటల కేమి? మతము స్వీకరించుచో పంతులు వగుదువు; మా అమ్మాయి పంతులమ్మ యగును అని విశాఖ.

గంభీరముగా ఆలోచించి రాముఁడు-నరే ఆలోచింతు ననెను. ఏసంగతియు రేపు చెప్పుమని విశాఖ యనెను. రాముఁడు సరే యనఁగా విశాఖ వెళ్లిపోయెను.

రాముఁడు వెంటనే సోములకడకు వెళ్లి అయ్యా! నాకు అన్యమతమున కలియవలెనని వచ్చిన దుర్గతి పట్టినది. మా నాయన మీ కడ దాఁచినధన మీయఁగోరుచున్నాను అనెను.

విధవవు! నీవు! నీ కొక అన్యమతము నీవు మతములో కలిసినంతమాత్రమున మా మతమునకు ఏమియు ధోకా లేదు లే.

అయ్యా. ఆ మాట అటుంచుఁడు. డబ్బు మాట చెప్పుఁడు.

ఆ మాట చెప్పఁబడఁగానే సోముల కనుతెర వేసి లోనికి బరుగెత్తి రివాల్వరు తెచ్చెను. తల్లి వెను వెంటనే వచ్చి నేరుపుగా లాఁగికొని నూతఁబాఱవైచెను. సోముల చండాలప్రేమ అని తల్లిని తిట్టి నూతి దిగ ప్రయత్నమున నుండెను.

రాముఁ డచటినుండి పద్మనాభశాస్త్రి గారియింటికి వెళ్లెను. 'శుని చైవ శ్వపాకే చ బ్రాహ్మణా స్సమదర్శినః' 'శుని అంటే కుక్క యందును నున్నూ శ్వపాకే అనఁగా కుక్కల తినే మాలమాదుగలందును నున్నూ బ్రాహ్మణులకు ఒక టేచూపు' అని వినఁబడుచుండఁగా ఉపశాంతి కలిగి దూరముగా కూర్చుండెను. పద్మనాభశాస్త్రి రాముని చూచి పాఠము చెప్పుట చాలించి పదిమంది శిష్యులతో బయటికి వచ్చెను. రాముఁడు దండప్రణామము చేసెను.

...్యలందఱు పక్కన నవ్విరి. పద్మనాభ
...ోపము పెరిఁగెను. వాడలోని బ్రాహ్మ



...ులందఱు వచ్చి నాళ్లనడుమ కేలవచ్చితివని
... రాళ్లు రువ్వ కఱ్ఱలు విసరిరి."

... వచ్చి నాళ్లనడుమ కేల వచ్చితివని
...్వ కఱ్ఱలు విసరిరి. రాముఁడు దెబ్బలు
...ు మాటాడక వెళ్లిపోయెను.

...యుఁ డింటికిఁబోయి ఇఁక అన్నము
...ు, బైబిలు చదువుకొనచ్చును అని
...ు.

...యుఁ డామఱునాఁడే మతమున కలిసి
... యూనెను. ఆమఱునాఁడే రెబె
...ఁ్జడెను.

## ౪

జకరయ్యకు బైబిలుచే నోరు నిండెను గాని అన్నముచే కడుపు నిండలేదు.

రెబెకా జకరయ్య లిరువురు నెలరోజులు రెండుపూఁటలు ఫాదిరీ యింటిచుట్టూ తిరిగిరి. ఫాదిరీ తనకు నూటయేఁబది రూపాయ లిచ్చుచో పాతిక రూపాయల ఉద్యోగము నిప్పింతు ననెను.

అయ్యా! అన్నముచే కడుపు నిండుట యొకటి; బైబిలుచే నోరు నిండుట యొకటి. ఈ రెండును నన్ను కిరస్తాని మతమునకు గుంజినవి. నేను పూటకూటికి టికాణా లేనివాఁడను. నూటయేఁబదిరూక లీయఁగలుగుట ఈ జన్మమున ఇఁక నసంభవము.

జకరయ్యా! ఓటిమాట ఎందుకు? నీకెంత డబ్బున్నదో ఎవరివద్ద నున్నదో మాకు తెలియదూ? కాటఁమా కాసులమూటా అంద ఱకు తెలియును.

అయ్యా, కాదు కాదు. కాసులమూట మాట నిక్కమే. మా నాయన అప్పుండీ వారి కిచ్చివేసెను గాని అది మాది కాదు.

ఫాదిరీ నవ్వి ప్రకృతము ఆఱురూపా యలకొకటి అయిదు రూపాయలకొకటి ఖాళీ ఉన్నవి మీ యిద్దఱు ప్రవేశింతురా? అనెను.

రెబెకా జకరయ్యలు సంతోష పూర్వక ముగా అంగీకరించి వెళ్లిపోయిరి.

వారు దూరముగా వెళ్లుటచూచి ఫాదిరీ కంటిజోడు మేజాబల్లమీఁదఁ బెట్టి— తెలివి తక్కువవారు— ఫూల్స్— ఇపు డేమయి నది? ఒకటి ౧౪, మరొకటి ౧౦ వెరసి ౨౪. వీరికిచ్చునది౧౧ తీసివేయఁగా ౧౩. ౧౨౧౩ లు = ౧౬ ౮. ౧౪౦ ఇమ్మనఁగా సకల అబద్ధములూ ఆడినాఁడు. ఇపు డీక ఏటేట నూట అరువది యెనిమిది రూపాయలు అతిరాలా యిచ్చునఁగాక అని అనుకొని గుడిలోనికి వెళ్లి పోయెను.

రెబెకా జకరయ్యలు పంతులమ్మగాను, పంతులుగాను ప్రవేశించిరి. రెబెకాకు పది, జకరయ్యకు పదియేను, అసలు జీతము. ఇది వారెఱుఁగరు. ఫాదిరీ వారికి గురుదేవుఁడు.

ప్రతి ఆదివారము, రెబెకా జకరయ్యలు చెరియొక పావలా ఏసుపేర ముడుపీయవలసి యుండెను. మరియు మరికొన్ని పండువులలో మరికొన్ని ముడుపులు కట్టవలసియుండెను. ఈ విషయమంతయు పర్యాలోచింపఁగా కుడిచేతితో ఇచ్చి ఎడమచేతితో లాఁగికొనినటు లుండెను. వీనికి చెల్లఁగా మిగిలిన ద్రవ్యము వారిరువురి పొట్టలకు చాలలేదు. ప్రొద్దుగ్రుంకులు బడిలో వాగి వాగి యింటికడ వారికి వాకట్టు.

ఫాదిరీ తమ జీతములో సగము హరించుచున్నటులు జకరయ్యకు కర్ణాకర్ణికగా తెలిసెను. జకరయ్య మొదటమొదట నమ్మలేదు కాని పిదపఁబిదప సత్యము తెలిసికొనఁగలిగెను.

జకరయ్య ఒకనాఁడు ఫాదిరీ దర్శనమునకు వెళ్లెను. అతఁడు బైబిలు చదువుకొనుచుండెను. జకరయ్య వందనముచేసి తన దైన్యమును చెప్పికొని ప్రకృతము జరుగుచున్న అన్యాయమును పైకి పోనీయకుండ సర్దుపాటు చేసి తనను అనుగ్రహింపవలసినదనియు మత ముయొక్క సత్యమునకు తాము తండ్రులనియు మనవిచేసికొనెను.

ఫాదిరీ చిఱునవ్వుతో—ఓరీ! మేము ఏసు కులమువారము, సాతాని వారికి శిష్యులము. మీకును ఏసునకును సాతానిసంబంధము లేదు. మాగుండా మీరు ఆ యేసుప్రభువు గుడి వాకిటికి మాత్రము వెళ్లఁగలరు. మీ వల్లవారందరు మాకు బానిసలు. బానిసలయందు ఉంచవల


"మీ వల్లవారందరు మాకు బానిసలు. బానిసలయందు ఉంచవలసిన దయ మాయందు చాలఁగలదు."

మాయందు చాలఁగలదు. నేను
గినంత ఉపకారమును చేసివేసితిని,
చేతిలో ఏమియు లేదు. అనెను.

రయ్య తలవాల్చి—And unto him
teth thee on the one cheek offer
other; and him that taketh away
forbid not to take thy coat also—
ోపల అనుకొనెను. ఫాదిరీవద్ద సెలవు
ని వెళ్లిపోయెను.

ుది రోజులలోనే రెబెకా జకరయ్య
్యోగము ఉద్వాసిత మయినటులు

కా అనాఁడు భర్తతో కిరస్తాని
ానిమతము అనెను. జకరయ్య చిఱు
నేను పద్మనాభ శాస్త్రిగారి యిం 
పుడు వారు 'శుని చైవ శ్వపాకేచ
సమదర్శినః' అని చదువుచు నున్న
నే తన్ని తగిలినారు. ఫాదిరీని చూడ
వారు 'For whosoever shall
ill of my Father which is in
the same is my brother, and
d mother' అని చదువుచున్నారు.
్యాయము చేయవలదని వేడుకొనఁ
ను ఏసునకును సాహోత్సంబంధము
ాఁగుండా మీారు ఏసుప్రభువు వాకి
ము వెళ్లఁగలరు. మీా నల్లవారం
బానిసలు అని తెగడెను. పైని డిస్మిస్
. కావున ఏమతములో తప్పు
నుష్యునిలోఁ గాక? మానవుల

కందఱకు ఒకటే మతము కలదు—సమదర్శి
త్వము అనెను.

అనాఁడు వారికి ధర్మసన్నములతో సరి
పోయెను. వారికి దైనందినము గీతాబైబిలుల
పారాయణఫలముతో పాటు క్షీపవాసవ్రతఫల
మును సంపూర్ణముగా లభించుచుండెను.

౫

జకరయ్యా ఉదరపోషణకు కాపు భోగయ్య
నాశ్రయించెను. ఆశ్రయింపగా నాశ్ర
యింపఁగా ఈ క్రింది పత్రికము కుదిరెను—
"సేద్యమునకు కొంత పొలమిచ్చి పెట్టుబడి
పెట్టుట; పంట సాఁబాలు; పెట్టుబడిలో పాలుకు
సఁబడికూళ్లు చెల్లుపెట్టుట; పెట్టుబడిమీాఁద
రూపాయి తొమ్మిదణాల సాలుసరి కాంపౌండు
వడ్డీ; ఇల్లూ దొడ్డి తాకట్టు." ఈనియమములతో
జకరయ్యా ఱెక్క కట్టి పొలమున అడుగుపెట్టెను.

జకరయ్య రెండుజాముల వఱకు దున్నఁ
గా సాయంకాలము వఱకు రెబెకా పెళ్లమేపును.
భర్త మోట తోలఁగా భార్య నీరు కట్టును.
వారిరువురును చోడివారు పోసి పెంచి ఊడ్చిరి;
మిఱపతోఁట పెట్టిరి; పొగాకుతోఁట వేసిరి.
రాత్రి రెబెకా రాటముమీాఁద నూలుతీయుచు
భర్త బైబిలు చదివి చెప్పఁగా ఆలకించుచుండె
డిది.

జకరయ్యకు పాటకపు జాతిలో పలుకుబడి
ప్రబలము. బిడప్పు వచ్చినపుడెల్ల అతని
శాకనాఁ దలిఘి.

ఈ గౌరవములలో అతఁడు తన సేద్య
ను మఱవలేదు.

ఒకనాఁడు రైలులో సోములును ఫాధి
యు కలిసిరి.

జకరయ్యా మీ మీఁద పిటీషను పెట్టు
ు కొనుచున్నారు.

దానికేమి? మీవిల్లుముక్కలూ కోర్టు
క్కానట.

జకరయ్య దుర్మార్గుఁడు.

జకరయ్య ఇన్‌ఫిడెల్, పతితుఁడు.

వానిని వంచుటకు ఏమి ఉపాయము?

మీకు చేతనైన ఉపాయము చేయుఁడు;
ు మీకు భయము రాకుండ జేయుదును.
సనరీకి ఎంత ప్రభావ మున్నదో మీ రెఱుఁ
ా?

ఎఱుఁగుదును ఎఱుఁగుదును. మిమ్ము
్మనా?

క్రీస్తుమీఁద ఒట్టు.

ఇరువురును రైలు దిగి పోయిరి.

పంటలు చక్కగా పండెను. పైరకు పైరొ
నేలమీఁద వాలుచున్న బామచిలుక
ు రెక్కలవలె నుండెను. పొగాకు మొక్కలు
న్నుకాల్పవలదు నన్ను కాల్పవలదు' అను
దముగా వెడఁదబారు టాకులతో చేతు
ద్ధి నిలువఁబడెను. తవీద యాకులు తమ
్మనంతయు ఎన్నులకిచ్చి దివాలాతీసెను.



రేపు లేక ఎల్లుండి కోయవచ్చుననఁగా భూతములలో కల్లోలము పుట్టెను. గాలి చెలఁరేఁగెను. మబ్బులు కమ్మి తటిమి తటిమి ఉఱిమెను. పాములవలె మెఱుపులు, ఫిరంగిగుండ్లవలె పిడుగులు, తుపాను. తన కూఁతురైన భూమిని జలము పెద్దపులివలె గ్రసించెను. జడముల కేటి పాడి?

జకరయ్య ఈ వ్యత్యయములో శైవాచార్యులవలె జగదనిత్యతను తెలిసికొనెను.

పదిరోజులకుఁగాని భూతములకు సమత్వము కలుగలేదు.

జకరయ్య భోగయ్యవాకిట నిలిచెను. భోగయ్య దైవికముగా పంట పాడగుటకు చింతించెను. పిదప ఇట్లనెను—నీవు బాకీ తేల్చలేవు, ఈ సాలుకు పెట్టుబడిలో ఈయవలసిన ఏఁబది రూకలు తెచ్చి యిచ్చుచో పొలము నీ క్రింద నుండునటులు చూతును. పండినను ఎండినను మిషనరీవారు నీకంటె ఎక్కువ డబ్బు ఇత్తుమనిరి, వారి కిచ్చెదను.

అయ్యా! నే నీయఁగలుగుదు ననియే అడిగితిరా?

నన్నేక నేమియు అడుగవలదు. చేతనైనచో పైకము తెమ్ము.

జకరయ్య మాటాడలేదు. భోగయ్య సమాధానముతో పనిలేక కాఁబోలు లోనికి వెళ్లిపోయెను.

రబెకా యింటికి వచ్చిన భర్తముఖము చూచి స్థితిగతులు మారెనని తెలిసికొనెను.

ి అన్న మిడుట కింట నూకలు లేవు. నూలు
మ్మి నూకలు తెచ్చుటకు సాలెయింటికి
.

తఁ డొంటిగా కూర్చుండికూర్చుండి వగచి
యింటిలో అటిటు తిరుగుచుండెను.
చటికి విశాఖ వచ్చెను. అల్లుమామలు
ండిరి.

రయ్యా! మీనాయన నరసింహులుగారి
సులమూట దాఁచినట్లు వినుకలి. అదియు
నరసింహులుగారు నీకేదో విల్లు వ్రాసి
టులును వాడుక. దానివలననే నీకు
పిల్లనిచ్చితిమి. ఇట్టి కఱవులో ఆ ధన
తెచ్చికొనవు? నీకు పిఱికితనమా మె
నడిగివచ్చెదను.

ను పెండ్లికాకమునుపే గర్భదరిద్రుఁడ
వా! కాసులమూట నీటిమూట. విల్లు

ాఖ ఆ మాటలు నమ్మలేదు. లేచి
యింటికి వెళ్లెను. ఆ యింటికి తాళము.
సమునకు అతఁడు కొండదరి తోఁట
యింటిలో కాఁపురముండెను. విశాఖ
వెళ్లెను. సోములు విశాఖనుచూచి
వచ్చె ననుకొనెను. అటు లే
. క్రమముగా తగవు పెరిఁగెను.
ోని కేఁగి తలుపులు మూసికొనుచు-
ముక్కలను తీసికొని వాని నొంటిగా
మ్మనుము అని అఱచెను. విశాఖ
ళ్లెను.

సోములు దూరముగానున్న జకరయ్యను చూచెను. వస్త్రము కప్పుకొని అరుఁగుమీఁద కూర్చుండెను. అతనికనులు చంద్రనిప్పులు. నరములు ఉబ్బియున్న తిత్తులు. మొగము కొలిమి. జకరయ్య నమస్కరించి నేలమీఁద దూరముగా కూర్చుండెను.

కాకితపు ముక్కలు తెచ్చితివా?

అయ్యా! నాఁడే తగులఁబెట్టితిని. మీకు ఆ సందేహము పోగొట్టుటకే వచ్చితిని.

ఈయవా? ఈయవా?

నిక్కము. తగులఁబెట్టితిని.




"కొండపై ప్రతిధ్వనింపక మునుపే
జకరయ్య నేలపై వ్రాలెను."

ఇదిగో మా నాయన కళంకము మాపెదను. అని సోములు బట్టచాటున నున్న పిస్తోలు నెత్తెను.

ఏసు మిమ్ము రక్షించుఁగాక !

నీ యేసు నిన్నే రక్షింపలేఁడు చూడుము అని సోములు పేల్చెను. కొండ ప్రతిధ్వనింపక మునుపే జకరయ్య నేలపై వ్రాలెను. సోములు దగ్గఱకు వెళ్లి చూచెను. ఒక కాకితపు ముక్కయు లేదు. సోములు పాఱిపోయెను. జకరయ్య కష్టముగా లేచి దూరముగా వెళ్లి లోయలో పడిపోయెను.

క్రమక్రమముగా గ్రామమంతయు గుమికూడెను. రెబెకా బియ్యపుమూటతో వచ్చి కాళ్లకాడ కూర్చుండి అతని మోమును నిబ్బరముగా చూచుచుండెను. అతనియత్తమామలు సోములను తిట్టుచు ఏడవఁదొడఁగిరి. జనులందఱు ఇంటిలోని కుఱికిరి. శూన్యము.

పోలీసువారు వచ్చిరి. వారిమాట వినఁబడఁగనే జకరయ్య కనులు తెఱచెను. ఇన్స్పెక్టరు దగ్గఱకు వెళ్లి నీ మీఁద పిస్తో లెవరు పేల్చిరి ? అని అడిగెను.

జకరయ్య—నేనే

ఇన్స్పెక్టరు పెదవి విఱిచి—ఎందులకు ?

జకరయ్య—కేవలము నేనే నేనే నేనేఅని శ్వాసలు విడిచెను. రెబెకా మూర్ఛిల్లెను.

---

# సుధాకర తత్త్వము

విక్రమదేవవర్మ గారు

సుధ యన నమృతంబు సున్నంబు నౌసుధా
కరుఁ డనంగ ధవళకిరణుఁడ సుమి
సుధ కిర వను సుద్ది సూరికల్పిత మగు
నమృతమునకు వసతి యగునె గ్రహము?

---

## ధన్యనైతిని!

శ్రీమతి గుమ్మడిదల దుర్గాబాయి గారు

లా! లీలా! యింతవఱకేమి చేయుచుంటివే! అబ్బా! రాట్నమున్న నీకు తిండియూ, నిద్రయు ...వక్కఱలేదుగదా! తండ్రిగారు నీకొఱకై వేచియు ...రు. భోజన మొనర్చి తిరుగబోగూడదా!' యనుచు ...లాబాయి లోపలిగదిలోనుండి తన ప్రేమపుత్రిక ...ు లీలను పిల్చుచుండెను. 'వచ్చుచుంటి నమ్మా' యని ...మ లీల రాట్నము నక్కడ దిగవిడచి కదురు తీసి ...తీరువాతో జాగ్రత్తపరచి తండ్రియొద్దకు జనియెను.

శ్రీనివాసరావుగా రప్పుడే భోజన మొనర్చి ...ు తోడుకొని కమలాబాయి అందిచ్చు తమలపాకు ...ుపు లందుకొనుచుఁ 'నీ వెక్కడ నున్న లీల జాడ గానే ...దే! పాఠశాలనుండి యింటికి వచ్చినదా? యని యేమేమి ...బోవుచుండగనే లీల తండ్రిగారిం జేరి, 'నాయనా' ...రాబోవు డిసెంబరు నెలలో జరిగెడి కాంగ్రెస్ మహా ...ు జరుగబోయెడి వస్తుప్రదర్శనమునకై మా పాఠశా ...పాధ్యాయులు యే బాలికలు చాల సన్నముగ నూలు ...తెత్తురో వారలచే నూలు పండులు తయారుచేయించి ...ల కొక బహుమాన మిత్తుమని నుడివియుండుటచే ...శాలనుండి వచ్చినదాది రాట్నమునొద్దనే యుంటిని. ...ాలస్యమునకు క్షమింప వేడెదనని పలికెను. ...మ్మా! నీ కార్యదీక్ష కెంతయు సంతసించితిని. లెమ్మ ...జని భోజన మొనర్చి, నూలు వడికి నీ తోడిబాలిక ...విజయలాభమంది నీ ఉపాధ్యాయుల ఆదరమునకు ...కురాలవు కమ్మని, ఆశీర్వదించి తండ్రి ప్రొద్దుట ...వేవేగ కోర్టునకు వెడలెను.

శ్రీనివాసరావుగారు ఆ గ్రామమందు పలుకుబడి ...న యొక సంపన్నగృహస్థు; శాంతస్వభావము గల ...ు, భూతదయాపరుడు; విరివి లబడి బరవలో దిగ ...ధనతృష్ణాతురుడై స్వార్థమున్నది వీడకయుండు పెద్ద ...న్యాలవలెగాక, తన కున్న కొద్దియో గొప్పయో ...సహాయార్థమై వినియోగించుచు, తోడివారు ...ఘల మెప్పించుచుండెడివాడు. కమలాబాయికూడ తన పతి సుగుణముల కేమాత్రము తీసిపోవక, పతి ఆదరణకు తానై ఆయన సత్సంకల్పములకు చేయూత నొసంగుచు తోటి స్త్రీజాతి కెల్ల తల మానికమై యొప్పుచుండెను. ఈ కమలా శ్రీనివాసదంపతుల కేకమాత్ర పుత్రిక లీల. లీల లీలలఁ గాంచుచు ఆ దంపతు లందుచుండెడి సంతోషమునకు మేరలేదు. అయిదేడులు వచ్చినతోడనే లీల తనకు తానై పాఠశాలకుంబోయి యుపాధ్యాయులు చెప్పెడి పాఠములం దధిక శ్రద్ధవహించి వారియొక్క వినయ వివేకములతో ప్రవర్తించు తన నెచ్చెలులలో నగ్రగణ్యయై వెలుగుచుండెను.

సాయంకాలమయ్యెను. గోగణము తమతమ నెలవులు చేరుచుండెను. పక్షులు నోట నెరనిడి తమతమ లాయముల వైపు తిరుగుచుండెను. బాలురు, బాలికలు, పాఠశాలల విడిచి తమతమ పాఠములఁగూర్చి యొండొరులతో ముచ్చటించుకొనుచు ఇండ్లకు చేరుచుండిరి. లీల కూడ చేత పుస్తకములనిడి గృహముఁజేరెను. కమలాబాయి లోన వంటచేయుచుండెను. వంటపనులలో తల్లికి కొంత సహాయమొనర్చి లీల తన చిన్నిపూదోటలోని మొక్కలెట్లున్నవో చూడనేగెను. శ్రీనివాసరావుగారు ఆఫీసు నుండి యప్పుడే యింటికివచ్చిరి. కాలుసేతుల గడిగికొని బల్లపైనున్న వార్తాపత్రికను గైకొని కాంచుచుండెను. కొంతసేపటికి 'లీలయెక్కడ?' యని యాయన సేవకు నడిగెను. 'అమ్మాయిగారిప్పుడే పూఁదోటలోనికేగియున్నా' రని సేవకుడు చెప్పెను. తిన్నగా తానుకూడ తోటలోనికి జని సాయంత్రలక్ష్మికిం బోలె పశ్చిమాంబుధిని గ్రుంకనున్న వృద్ధభానుని అరుణకాంతులు ముఖమునందలము కొన చిన్నిచేతులతో గాలికెగురు ముంగురుల నెగద్రోసికొనుచు వనమునందున తా బడిలోనేర్చుకొన్న జాతీయ గీతములం బాడుకొనుచు పూలమొక్కలనడుమ తిరుగాడు లీలంగాంచి 'ఆహా! అపార కృపామయుడగు భగవాను డిట్టిసుగుణఖనిని నాకు లభింపజేసినాడు! ఈ బా

# 'ఫీల్డింగు'

## క్విక్ స్టార్టింగు శెమిడీశల్ క్రూడాయిలు యింజను వేపరైజరు కాల్చవలసిన అవసరము లేకుండగనే రెండే నిమిషములలో స్టార్టు కాగలదు—




హై కంప్రెషను యింజనులకు వుండే కష్టములు యీ యింజనులకు యెంత మాత్రమున్ను లేవు. లోడు లాగుటలోను, క్రూడాయిలు ఖర్చు తక్కువ అగుటలోను, తరుచు రిపేరు లేక పోవుటలోను యీ యింజనులు చాలా ప్రసిద్ధి చెందినవి. అన్ని సామానులున్ను మిక్కిలి టెంపరు గలవిన్ని బలము గలవిన్ని అయి వున్నవి. వేలకొలది అతి తృప్తికరముగా పనిచేయు చున్నవి. ధరలు అతిసరసముగా వుండును. 52 గుర్రముల పవరువరకు అన్ని సైజులు స్టాకులో సిద్ధముగా నున్నవి.

సోల్ యేజంట్లు:—

బ్రాంచి:
మెయినురోడ్డు,
విజయనగరం.

డి. యల్. శాస్త్రీ అండు కో,
**12**, తంబుచెట్టి వీధి,
మదరాసు.

# ది మైసూరు అగ్రికల్చరల్
# డైరీఫారం కంపెనీ లిమిటెడ్

## లైఫ్‌స్టాకు కాంపెన్‌సేషను బ్యూరోతో కలిసియున్నది

## స్థాపితము 1924

ప్రధాన కార్యాలయము:—బసవనగుడి, బెంగుళూరు

వ్యవసాయదారులకు, జంతువులుగలవారికిని ప్రత్యేకసౌకర్యముకలదు. దీని విశేషమైన లక్షణము లేవనగా.

లైఫ్‌స్టాకు రిజష్ట్రేషను వడ్డీ తక్కువ

,, సర్టిఫికేటు హోల్డరులకు సులభమగు ఇన్‌స్టాల్‌మెంటు పద్ధతిని అప్పులుతీయుటకు హక్కుగలదు.

,, సర్టిఫికేటులు నాన్‌ఫార్‌ఫెయిటబుల్

,, హక్కులు త్వరగ స్థిరపరచబడును

కావలెను:—హిందూదేశమందు ప్రతిచోటను, బర్మా, సిలోనులందును ఆర్గనైజింగు ఇన్‌స్పెక్టరులు, సూపర్‌వైజరులు, సబ్ ఏజంట్లు కావలెను.

పద్ధతులు:—జీతముగాని, కమీషనుగాని, లేక రెండునుగాని ఇవ్వబడును.

ఇతర వివరములకు:—మానేజింగు డైరెక్టరుకుగాని, యీక్రింద నుదహరించిన బ్రాంచీల ఆర్గనైజింగు ఇన్‌స్పెక్టర్లకుగాని వ్రాయవలెను.

| | | |
|---|---|---|
| అమలాపురం | ఖుల్నా | నెల్లూరు |
| బరంపురం | కొప్పా | నౌగాంగు |
| కల్లికోట | కొట్టాయం | పుదుచ్చేరి |
| కోయంబత్తూరు | మచిలీపట్నం | రాణిపేట |
| గౌహతి | మధుర | సేలం |
| జోర్‌హాట్ | నంద్యాల | తిరుచనాపల్లి |
| | | విజయనగరం |



ఆంధ్రబాలిక

చిత్రకారిణి: శ్రీ సరస్వతిగారు శారదానికేతనము, గుంటూరు.

లక్ష సదయహృదయమునకుం దోడు దేశభక్తికూడ నలవడినది! నాహృదయగతమగు ఆశలచిగిర్చి పుష్పించి ఫలించు సూచనలు సుగుణమణియగు యీ లీలా మూలముగ భగవంతుడు నాకు గానిపింపజేయుచున్నా' డని మనమున తలపోయుచు తదేకధ్యానమున ఆమెను వీక్షించు చుండెను. ఇంతలో ఇంటినుండి 'శ్రీనివాసరావుగారున్నారా?' అనుకేక వినబడుటతోడనే ఆలోచనా పరంపరలో మునిగియున్న ఆయన 'ఇదిగో వచ్చుచుంటి' నని లోనికరిగెను. రాత్రి చీకటులు గ్రమ్ముకొనుటచే లీల. కూడ వనవిహారము చాలించి యింటిలోని కరిగెను.

౨

శ్యామసుందరుడు కొంచెము పొడవరి. దాదాపిరువది యేండ్లుండవచ్చును. విశాలనేత్రములు, ఆజానుబాహులు, సమున్నత శరీరము, పసిడిచాయయుకల్గి ఆతడు చూపరుల కంతయు ముదముగూర్చు చుండెను. ఆతనికి సౌందర్యమునకు తోడు సుజనసద్గుణములు సువర్ణమునకు తావి యబ్బినట్లు ఒప్పుచుండెను. ఆతని శరీరచ్ఛాయకు తోడు ఆతడు ధరించియున్న ఖద్దరువస్త్రములు ఆతని శోభవింతయందము కూర్చుచుండెను. ఆతడు అగ్రహారములో నున్న దొరతనమువారి కళాశాలయందు పట్టపరీక్షకై చదువుచుండెను. ఆతడు ప్రతిపరీక్షలోను అగ్రస్థానమలంకరించి రాజధానికంతయు ప్రథముడుగ నుత్తీర్ణుడగుచుండెడివాడు. ఈతనికి కేవలము విద్యయందే కాక హాకీ, క్రికెట్, టెన్నిస్ మొదలగు ఆరోగ్యాభివృద్ధి నొసగు వ్యాయామములయందు కూడ చాకచక్యము కడు మెండు. ఎన్నిమారులో నాతడు వ్యాయామోపాధ్యాయి బృందముతో కలిసి దేశదేశాంతరముల కేగి తా నేర్చుకొన్న వ్యాయామ పరిశ్రమలయందు ఎదిరిబృందము నోడించి, అగ్రస్థానమంది తాఁజదువుకొను కళాశాలకొక అలంకారమని పేరుపడసి జయలక్ష్మిని చేబట్టి పురమునకు, మరలెడి నృపతివలెనెడి జయజయ ధ్వానములతో గ్రామమునకు మరలుచుండెడివాడు. కాని ఈతని సుగుణములను గని వాని మురియు భాగ్యము లేకుండగనే ఈతని తలిదండ్రు లిహలోక సౌఖ్యముల వీడిపోయిరి. తలిదండ్రులు లేని లోటు లేకుండ ప్రసాదరావుతమ్ముని అతిగారాబముతో చూచుచు కంటికి రెప్పవోలె కాపాడుచుండెడివాడు. ప్రసాదరావు కొంచెము ముంగోపముగలవాడు. తాప ట్టినకుం దేటికి మూడే కాళ్లనువారిలో నొకడు. ఈతడ దొరతనమువారి కొలువునందుండి వారి అడుగులకు మడ గులొత్తుచు, స్వేచ్ఛకు తిలాంజలి నొసంగి స్వార్థము కోరుచుండు మహనీయులలో నగ్రస్థాన మలంకరి చెను. ఈతడు తమ్ముని ఎన్నిమారులో ఖద్దరువస్త్రము విడువుమని బోధించెను. కాని, విఫలమనోరథు డగు చు డెను. రాట్నమన్నను, ఖద్దరువస్త్రములన్నను, ఆత జనియించెడి క్రోధ మింతింత కాదు. శ్యామసుందరుడ కళాశాలనుండి వచ్చినదాది మాతృసమానయగు వది లక్ష్మీబాయియొద్ద గూర్చుండి ఆమెకు రాట్నము వడ చుండుట నేర్పుచున్నప్పు డెంతయు మనమున విసుగ చెందుచుండెడివాడు.

ఫిబ్రవరినెల దేశమంతయు సైమనుకమిషను బహి ష్కార కాందోళనలతో అల్లకల్లోలముగనుండెను. ఏప్ర కలజూచిన నీవార్తయే! ఎవరినోట విన్న నీమాటయే నాడానగరమం దెక్కడమాచినను విద్యార్థులసంరంభ మే శ్యామసుందరుడు ప్రాతఃకాలకృత్యముల నెరవేర్చుకొ శుభ్రమైన ఖద్దరువస్త్రమును ధరించి జాతీయైక మత్య మునకు మూలకారణ మనదగు జెండా చేత నిడి అన్న గా రెంతగలదనుచున్నను తన భావిజీవిత మెట్లు పరిణమించునో యను సందేహ మిసుమంతయును లేక దృఢదీక్షాపరు "మహాత్మగాంధీకి జయ్" అని కేకలిడుచు రణరంగము మరికొక వీరునివలెనే తోడి యువకుల ప్రోత్సహించుచు నగరసంకీర్తనలో పాల్గొనుటకై వెడలెను. సాయంకా మయ్యెను. పట్టణపురమందిరమంతయు స్వచ్ఛందసేవకు యుత్సాహముతో, బాలుర జయజయధ్వానములతో కూడి కర్మచారుల తత్తరపాటుతో అల్లకల్లోలము నుండెను. శ్యామసుందరుడు నాటిసభయందు స్వచ్ఛం సేవాదళనాయకుడై యెక్కడమాచిన తానయై చా "సుల గంభీరోపన్యాసముల నతిశ్రద్ధగ నాలించుచు, మున నుత్సాహ తరంగములు మొలకలెత్త ఆవేశపూరి హృదయుడై ఒకచో గూర్చుండి తనలో తానిట్లు

ొడఁగెను. 'అయ్యో! ఈయుపన్యాసముల వినిన ారయొడలు జల్లుమనుచున్నదే! నేనింతవర కెంత ని యుంటిని! దాస్యశృంఖలాబద్ధునిగ నొనర్చు తీయవిద్య నేర్చుకొనుటయందు నా యమూల్య మెంత వృథా ఖర్చు చేసితిని! ప్రపంచమున దైవ స్వాతంత్ర్య దేవతలుగ పరిగణింపబడుచుండు దాము తమ స్వేచ్ఛాజీవనమును నిగళబద్ధముగ ంటయేకాక తమ భార్యాపుత్రికలగూడ దాస్య ప్రబోధించి విద్యావిధానములకే దోసి లొగ్గింప ుడ, ఇక వారలయందు జాతీయతాబీజములు ట్టు కెట్లు! మన కన్నతల్లి మన దేశమాత, మన మి యొక్క స్తనముల పాలంగ్రోలి ఆమె ుమధుర, సుశీతల జలముచే, పెంపబడి కర్త ులమై, ఆమె పరపదదళిత యగుచుండ గాంచి, ులమై విలాసతరంగములలో మునిగి తేలుచుం య్యో! తలచుకొన్న కొలఁది నాగుండె నీర రెండక్షరముల తోకతగిలించుకొని విరు ుశపడియుండు మహనీయులలో నేనొక్కఁడను ృగా! అయ్యో! ఎంత యవివేకినైతి. ఎట్టి నైతి. ఇకనైనను నాయీ తుచ్ఛ దేహమును మానవసేవకు అర్పించి, నా జీవితమును సార్థక 'సెదగాక' అని కృతనిశ్చయుడై అప్పటికి ంటల రాత్రియగుటచే, అన్నగారేమందురో ున కాళ్లు ముందరపథమును బంధించుచుఁడ ములెను.

3

డు అమావాస్య. ఆకసమంతయు కటికచీక ారు మబ్బులచే, భయానకమై చూపట్టుచుం ుఘగర్జనములు భయంకరశబ్దములు శ్రీనివాస ుటియందుండెడివారల హృదయములు మరింత ుచుండెను. నేటికి వారము దినములనుండి ాపుగారు ప్రబలబాధచే పీడితులగుచున్నారు. ుణాలు అనేకులు రోగినిగాంచి నిరాశను ుచుండిరి. లీలాకమలల హృదయములు పిడుగుల ఘోషిల్లుచుండెను. పిడుగుల ఫెళఫెళారావములు వారి భయకంపిత హృదయములను మరింత కలవరపరచుచుండెను. రోగి కడు నీరసించి, శల్యావశిష్టుడై యుండెను. కమలాబాయి విచారసంతప్త హృదయయై ఆర్తత్రాణ పరాయణుండను భగవంతుని వేనోళ్ల స్తోత్రము చేయుచు పతి పాదముల చెంత కడు నిశ్చలమానసయై కూర్చుండెను.

అర్ధరాత్రి. జగమంతయు గాఢాంధకారబంధురమై యుండెను. నక్షత్రముల కాంతిగూడ సన్నగిల్లెను. మిణుగురుపురుగుల స్వల్పకాంతులు తక్క వేరొండు వెలుగు లేదు. ఆకసము మేఘావృతమై, వర్షము వచ్చెడు సూచనలు పొడసూపుచుండెను. ఇట్టి భయంకరసమయమున ఇరువురు యువకులు ద్విచక్రశకటముల నధిరోహించి కడువేగముగ బోవుచు ఇట్లు సంభాషింప మొదలిడిరి.

"అయిన, రాధాకాంతా! డాక్టరుగారు యిప్పుడు వత్తురని యనుకొందువా? ఆయన సదయహృదయుడే. మన యజమానుని స్థితి నాలోచించిన బాగుగ గన్పట్టదు! మనలను తండ్రివలె ప్రేమించెడివాడు. ఎట్టివాడైనను మృత్యుముఖమున బడవలసినదే గదా. కానిమ్ము, దైవ ఘటన యెట్లున్నదో యెరుగ నేరికి తరము?" ఇట్లు సంభాషించుచు వారు కొంతవడికి డాక్టరుగారి గృహమును సమీపించిరి. డాక్టరుగారు నిద్రించుచుండిరి. వారిని నిద్రనుండి మేల్కొలిపి సంగతంతయు విన్నవించిరి. డాక్టరు సురేంద్రనాథ్ గారు కడుదయార్ద్ర హృదయుడగుటంజేసి శ్రమయని యెంచక అట్టి కటికచీకటి రాత్రి సమయమున తగు పరికరముల చేతనిడికొని, బయలువెడలి కొంతవడికి గృహమును సమీపించెను. డాక్టరెప్పుడు వచ్చునో, ఏమి చెప్పునో అని వీధిగుమ్మమునొద్ద నిలిచి చూచుచుండిన లీల డాక్టరును గాంచినతోడనే ఒక్క పరువున లోనికిబోయి "అమ్మా! డాక్టరుగారు వచ్చిరే" యనుచు తల్లిం కేకెను.

సురేంద్రనాథ్ గారు తిన్నగ గదిలోనికిబోయి, రోగి హస్తమును చూచి పరీక్షించి ఒక్క వేడినిట్టూర్పు

విడిచెను. డాక్టరేమిచెప్పునోయని అత్యంతము నాతురులైన తల్లి పాలు లిద్దరకును, డాక్టరుయొక్క నిరాశాపూరితదృష్టులు గాంచినంతనే ఏడ్పాగలేదు. "దీనావనా! దీనరక్షణబిరుదాంకా! మా తండ్రిని నా కుండవా? మా తండ్రిని కాపాడవా?" యంచు లీల బోరన నేడ్వసాగెను. ఇంతలో 'అమ్మా! లీలా' యని తండ్రి పిల్చుచున్నటులయ్యెను. అంత లీల తండ్రియొద్దకు జని "ఏమి నాయనా! ఏలపిల్చితిరి?" యని యనుచుండగనే, శ్రీనివాసరావు తన గారాబు కుమార్తెను శుష్కించి జీర్ణమైయున్న తనచేతులతో అదిమిపట్టుకొని హృదయము మీద నిడికొని, "నా కన్నతల్లీ, నా బంగారుమొలకా, నేను మిమ్ముల విడిచిపోవుచున్నాను. నాకు పరమేశ్వరుని ఆజ్ఞయైనది. మీరు విచారింపకుడు. మరణము జీవకోటికి సామాన్యమే! నిన్నొక యింటిదానిగ చేయజాలనైతిని. అదియె మనమున బాధించుచున్నది." అని యేమియో పలుకబోయి కఫము కుత్తుక కెగదన్నుటచే మాటలాడజాలక కొంతవడికి "అమ్మా... నేను... పోవు...చున్నాను... మాతృ.... దేశము... మాతృ... భూమిని... మరువ... వలదు... నా జీవితము... వృథాగా... గడిపి... వేసితిని... నీవైనను... భారతాంబ... ఋణము.... దీర్చి ... యాదీనుని... ఆత్మకు... శాంతిగల్గింపుము... దీనురాలకు... నీతల్లికి... ధైర్యము... చెప్పుము.... నీతండ్రి.... నీకు ఇక... లేడు... శ్రీమన్నారాయణా ... ఓ లీలా ...కమలల... నెట్లు... గాచెదవో."

ఇట్లు పలుకుచు ఆయుదార హృదయుడు విశ్రాంతి దీర్చుకొనువాని భంగి జగద్రంగమును వీడి కన్నులు మూసుకొనెను.

ఇక నేమున్నది? శ్రీనివాసరావుగారి పంచభూతాత్మకమైన శరీరము పంచభూతములలో కలిసిపోయెను. లీలా కమలల హృదయము లెట్లుండునో వ్రాయుటకు కలమాడుటలేదు.

౪

"లక్ష్మి! లక్ష్మి! అబ్బా! మన శ్యామసుందరుడెట్టివాడయ్యెనే! దేశము, దేశసేవ, యివన్నియు వీనియందే ఆవిర్భవించియున్నవి. ఈఖద్దరుగుడ్డలు, యీ రాట్నములు యివన్నియు వీనికొరకే బ్రహ్మ సృష్టించెనుగాబోలు! ఇంకను వీడేదో గొప్పగొప్ప చదువులుచదివి బిరుదములంది, దొరతనమువారి కృపకు పాత్రుడుగానోవునని యెంతయో మురియుచుంటిని. నా తలపులన్నియు బూడిదగలిసిన పన్నీరాయెనే! తిన్న యింటికి వాసములు లెక్కపెట్టినటులు నాకే పంగనామములు పెట్టుచున్నాడు! తండ్రితో సమానుడవగు నా యాజ్ఞ లెక్కసేయక నిన్న తాను పాఠశాల బహిష్కరించు టెందులకు? పట్టపరీక్షకువెళ్ల సంసిద్ధుడైయుండి మధ్యకొరవితో తల గోకికొనునటుల యీకృత్యములేల? దొరతనమువారెంతయుసమర్థులు. వారేమి సేయ దలచినను ఒక్కతృటిలో నొనర్పగలరు. వారి కోపానలమున కాహుతియగుటకంటె వేరొండులేదు." ఇట్లు యింకేమియో పల్కుచు మూర్తీభవించిన క్రోధదేవతవలె ప్రసాదరావు పడక కుర్చీమీద కూర్చుండి తమ్ముని రాక కెదురుచూచు చుండెను.

శ్యామసుందరుడు లోన నడుగిడుట తోడనే ప్రసాదరావు కనుబొమ్మలెగరవేసి "ఎవరు వారు? ఓహో! శ్యామసుందరరావుగారా? తిరుబడియైనదా? దేశనాయకులు మిమ్ముల విడచిరా? అసహాయోద్య మాందోళనలో ఎంతమందిమూర్ఖులు పాఠశాలలవిడచి, ఉద్యోగముల మాని, కూటికి గుడ్డకు మొఖమువాచి, దేశద్రిమ్మరులై, తిన్నచోట నిలువక, నిలిచినచోట నిద్రింపక, ఫకీరులవలె తిరుగుచుండుటలేదు? నీవు కూడ వారిగతినే అనుసరించుచున్నటులు తోచుచున్నది. కానిమ్ము! నీ ప్రారబ్ధమునకు నేనేమి చేయగలవాడను? వచ్చియు రానిమాటలతో, తప్పటడుగులతోనున్న నిన్ను తండ్రిగారు తమ మరణసమయమందు నన్ను జేరంబిలిచి 'నాయనా! నీకు రెక్కలు వచ్చినవి. నీతమ్ముడింకను చిరుతప్రాయము వీడలేదు. వానిని నీచేతులలో విడిచిపోవుచున్నాను. నీ తల్లి వానిబాల్యమందే గతించినదిగదా? ఇక వాని భారమంతయు నీదే. నీ తమ్ముని నీ వెటులుకాపాడెదవో?' అని నుడివియున్నందున నింతగ చెప్పవలసివచ్చెను." ఇట్లుచెప్పుచు ప్రసాదరావు పడకకుర్చీనుండిలేచి గదిలోనికివెళ్లి ఒక కవరుదెచ్చి తమ్మునిముందు విసరివైచి, ఇదిగో నీ పాఠ

నోపాధ్యాయులు ప్రాతఃకాలముననే దీనిని
న్నారు. దీనింగూర్చి నీయభిప్రాయము సకు
నిపల్కెను.

వరకు మంత్రముగ్ధునివలె, నిలువబడియున్న
రుకు ఉత్తరము తనకాలివద్ద పడినతోడనే
ొంది భయకంపితహస్తములతో దానిసాంత
చదివెను.

రా!

మకవిూవను బహిష్కారణాందోళనలలో
నిన యువకులు పాఠశాలనుండి వెడలగొట్ట
మా శాసనములను నీవు వినియేయున్నాడవు.
లయందు అందరకంటె చెక్కుడుగ వృద్ధి
ిగిన వాడవనియు, వినయ వివేక శీలాద్యాది
గల్గినవాడవనియు ఎంచి యింతవరకున్న
లు నీవు ఇట్టిపనులు చేసినను ఓపిక వహించి
నేడు జరిగిన విషయమున, నీవేగాక, తా చెడ్డ
చెరచినటులు తోడిసహాధ్యాయులనందర,
, వారలకూడ పాఠశాలలు మాన్పించి, యుత్స
గ్గొనినందున నిన్ను పాఠశాలనుండి వెడల
, పైఅధికారులు ఆజ్ఞాపించుచున్నారు.

ఇట్లు
ప్రధానోపాధ్యాయుడు.

ఉత్తరము చదివినతోడనే శ్యామసుందరుని
విచారానందము లొక్కటూరి, పరుసెడ
నిశ్చేష్టుడై, నోటమాటలేక పదినిమిషము
నిలువబడియుండెను. శ్యామా! భోజన
. ఇంతకే తడవైనది' యని, పిల్చు లక్ష్మి
పుటముల సోకినంతనే దీర్ఘాలోచనాపరు
్యామసుందరుడు తెల్వంది వదినా; ఇదిగో
తన గదిలోనికి వెళ్లి యుత్తరీయముతీసి,
డవైచి, వంటయింటివైపు మరలెను.
క్షించి మరది రాకకై నిరీక్షించుచుండెను.
పాదప్రక్షాళన మొనర్చుకొని విస్తర
గూర్చుండెనేకాని, మనస్సు మనస్సులో

లేదు. ఎంతయో బాధపడువానివలె గన్పట్టుచుండెను, సంగతంతయు నెరింగియున్న లక్ష్మిబాయి "శ్యామా, ఏమటులుంటివి? సరిగ భోజనమైన చేయలేదే, భుజింపుము. నాయనా మీ యన్నగారిసంగతి నీవెరింగియున్న దేకదా! వారికంత తోచిన నంతియేకాని వేరొండుగానరు. దైవనిర్ణయ మెటులున్న నటులగు విచారించి మనస్సును బాధింపచేయుట తక్క వేరొండులేదు." అని పల్కెను.

శ్యామసుందరుడు వేవేగ భుజించి, తల్లివలె ఆదరించి లాలించి ప్రేమించి కన్నకుమారుని భంగి ఆదరించెడి వదినగారితోనైనను మాట్లాడకతిన్నగ గదిలోనికేగి శయ్యపై వాలి, రెండుచేతుల తల నదిమిపట్టుకొని 'ఆహా! సర్వేశ్వరా! ఎట్టి విషమస్థితికి తెచ్చితివి? నా మనోదార్ఢ్యము నెరుంగగోరియే నన్నిట్టి యిక్కట్టుల పాల్చేయుచుంటివా? నే నిప్పు డేమి చేయుదును! నాకేదిక దైన్యము? అంతేవాని నింతవానిగ నొనర్చి, విద్యాబుద్ధులు చెప్పించి తన సర్వస్వము నన్నుగ భావించి పెంచుచున్న అన్నగారి యాజ్ఞ యొకవంక! దీనావనరై దిక్కులేక తనపుత్రులేమా తన్నుద్ధరించెదరని నమ్మి యున్న భారతమాత, శివాజీ, రాణాప్రతాప్, తిలక్, గాంధీ ప్రభృతులగన్న మాతృభూమి, సీత సావిత్రి దమయంతి చంద్రమతి మొదలగు సాధ్వీమతల్లులగాంచిన పవిత్రజన్మభూమి, దేశసేవకునై పలుబాధలపడి అనేకసంవత్సరములకఠినకారాగారవాస శిక్షకులోనై అవసానసమయమందు గూడ మాతృదేశమా, మాతృదేశమా యని విలపించుచు ప్రాణములర్పించిన చిత్తరంజన్, గోఖలే, నౌరోజీ, లజపతి రాయి మొదలయిన వీరశిఖామణుల గన్న భారతరత్నగర్భ, నా జన్మధాత్రి హాహారావములు మరియొక వంక!

కానిమ్ము, నా హృదయగతమగు కోర్కెయే పుష్పించి ఫలించుగాక. నేడే మాతృ భూరంగమునను నిక నాసోదరుల సుఖదుఃఖములలో పాల్గొని దేశమాతకు సత్పుత్రుడనై మెలగెదగాక! అపార కృపామయుడగు పరమేశ్వరుడు నా సంకల్పము నీడేర్చి నాకు చేయూత నొసంగి నాజీవితము ధన్యమొనర్పజేయుగాక!"

ఇట్లు తలపోయుచు శ్యామసుందరుడు హృదయ
ారము కొంత తగ్గ కర్తవ్యనిర్దేశ మొనర్చుకొని పొట్ట
ూటికై దాస్యవృత్తికి పురికొల్పు విద్యకు స్వస్తిచెప్ప
ర్ణయించి అన్నగారు దీనికెట్టికేడు నొసంగెదరో యను
యమంత్రయు విడనాడి దినమంతయు నలసియుండుట
చే నిద్రాదేవి యొడిలో శరణందెను.

అనుటనా ఘటన సమర్థుండగు భగవంతుని లీలలం
 చిత్రతరము! ఒకతరి మానవుల సంతోషాంబుధి నోల
ాడింపచేయుచుండును. ఇంకొకతరి విచారసాగరమున
ంచుచుండును. ఇంతవరకు జన్మించినదాది కష్టమన్న
ట్టిదియో యెరుంగక నిరంతర సుఖసాగరమున నోల
డు లీల కడు యిక్కట్టులకు లోనయ్యెను. కృష్ణపక్ష
్రునివలె ఆమె నానాటికి క్షీణించుచుండెను. క్షయ
ోగపీడితుని దేహమట్లు బాలదేహము కృశించుచుం
ను. మనోవ్యాధికి మందేది యనునట్లు ఆమెరోగము
కి నివారింప నశక్యమైయుండెను. బాల్యమాదిగ తన్ను
ంచి పెద్దదానినిగ నొనర్చి తనసుఖమునే యభిలషిం
మన్న పితృమరణముకై చింత యొకవంక, భర్తృవియో
నల దహ్యమానయై సతతము కన్నీరు కాల్వలై కార
ఖించుచు, శుష్కించి కడు దుర్బలయై మంచముపట్టి
 నాటికి కృశించుచున్న తల్లికై చింత మరియొకవంక.
ైతరి సామాన్య బాలికలైన, ధైర్యము విడనాడి కింక
ర్తవ్యతా విమూఢలై బెగడుచుందురు. అట్లుగాక
యగు లీల పొంగిపొంగి పొరలి వచ్చుచున్న దుఃఖము
పుకొనుచు తానే ఆశ్చర్యమందిన తన తల్లికూడ బెగ
ి అసువుల బాయగలదేమో యను భయమున కనుపా
క ధైర్యముతో నున్నట్లే కన్పట్టుచుండెను.

నాడు ఏకాదశి. ప్రాతఃకాలకృత్యముల నిర్వర్తిం
ొని చేతనొకపళ్లెమిడి దేవతాపూజార్హమై పూలుగొని
ప్పుటకు లీల తన చిన్ని పూదోటలోనికేగెను. నాటి
దయమునుండియు కమలాబాయిస్థితి మారినట్లుకాన్పిం
ున్నది. తనలో తానేదో గొణుగుకొనదొడ్చెను.
మనకుమ, "లీలా! లీలా! నీ ముద్దుముచ్చటలన్నియు తీరకుండగనే, నీ తండ్రి నిన్ను విడిపోయిరి. నిన్నొక యింటిదానిగ చేసినచో నాకీ చింత యుండకపోవును. పితృవియోగముచే పరితపించుచున్న నీవు మాతృవియోగముచే ఎంతదిగులందెదవో! సంపూర్ణ యౌవనవతివై వివాహయోగ్యవై యున్నతరి భగవంతు డెట్టి యాపదల పాల్చేసెనే! నీ తల్లియిక జీవింపజాలదు. మాతాపితృవిహీనవగు నీకిక దిక్కెవ్వరు? ఎట్టియాపదల పాలందవలయునో! ఎందరి యపహాస్యములకు గురి కావలసివచ్చునో! ఎందరుక్రూరుల క్రౌర్యముల బారి బడకుండ కాపాడుకొనవలయునో! ఆహా! దయామయా! నా చిన్నారి లీల నేమి చేయనెంచితివి? నామెకేది దిక్కు? లీలకు ధైర్యమొసంగుము. ఆపదలనుండి యుద్ధరింపుము. సద్బుద్ధినొసంగి, పుట్టినింటికి, మెట్టినింటికి సత్కీర్తి చేకూర్చునటు లనుగ్రహింపుము. నేనుపోవుచున్నాను. లీలను నీచేతనిడిపోవుచున్నాను. కాపాడుము" అని పలవించుచుండెను

లీల పూలను గొని తెచ్చి తల్లి మంచమునద్దకు వచ్చి చూచుసరికి కమలాబాయి స్మృతితప్పియుండెను. తల్లి స్థితి గాంచినతోడనే లీలకు ధైర్యము సన్నగిల్లెను. కన్నుల నుండి కారు బాష్పముల నొత్తుకొనుచు "అమ్మా! ఏమి యీ బాధగామన్నటులు గాన్పించుచున్నది" యని లీల తల్లిని పలుకరించెను. అంత కమలాబాయి "అమ్మా! నీ తల్లికి అవసానము సమీపించుచున్నది. ఇక నేపోవుచున్నాను. నీ తండ్రిగారు తమ మరణసమయమందు నీకాదేశించినమాట మరువవద్దు. నాకోరికకూడ నదియే. సత్పుత్రివై నీదేహమును మానవసేవకునై వినియోగించి సచ్చరిత్రవై తోడి స్త్రీలోకమున కాదర్శప్రాయవై, చదువులసరస్వతివై, విద్యలేక దేశమన్న నెట్టిదియో యెరుంగక దేశస్థితి యన్న నెట్టిదియో యెరుంగక భర్తయున్న శోకయముల నెంతయు ఆటంకమును గలిగించు వృథాప్రలాపములయందే కాలమంతయు గడపి అవిద్యాంధకారమందు మునిగి తేలుచున్న స్త్రీల నుద్ధరింపుము. అహంకారమును త్యజించి కొద్దిగొప్పలదరికి చేరనీయక నీకాలమును గడుపుకొనుచుండుము. ఇక మాట్లాడజాలకున్నాను, ఆయాస మధికమగుచున్నది. కొంచెము...మంచినీరు..." ఇట్లుచెప్పుచు మనస్సంతయు

ధీనము గావించి మాయాప్రపంచక రంగమునుండి ్రతాభినయము సమాప్తి గావించుకొనెను.

గాలికి దుమ్ము రేగిన ట్లీవార్త క్షణములో గ్రామ ు వ్యాపించెను. విన్నవారందరు "అయ్యో! ణి యను లీలకెట్టికష్టము సంభవించె! కరుణామ భగవాను డామెయెడ కడు నిర్దయుడాయెనే! ాలకేది గతి" యని వగవజొచ్చిరి. మెల్లగ నీవార్త ా ప్రధానోపాధ్యాయినియు, దయావతియు ారదాబాయిగారి కర్ణములం బడెను. వెంటనే ల గృహమునకుంజని తల్లి మంచము వద్దనే కొయ్య యున్న లీలంగాంచి తనవద్దనున్న ధనములో శవ దహనసంస్కారాదుల ముగింపజేసి లీలను తనతో ంటికి తీసుకొనివెళ్లి ఆదరించి ఆమెకు తల్లి లేని దీర్ప ప్రయత్నించుచుండెను. లీలయు ఆమె ంభాషణలచే ఆదరసత్కారములచే, కొంత దుఃఖ ల్లి తలిదండ్రుల అంత్య వాక్కుల స్మరించుకొ రి కర్తవ్య మీడేర్ప ప్రయత్నించుచుండెను.

౬

గ్రామమున శారదాబాయిగారి యెఱుగని వారె రు. ఆమె బాలికలయందు చూపెడి యనురా ద్యబోధించుటయందు గలనేర్పు, కార్యదీక్ష, ము, సహనశీలత, సర్వసమత్వము గాంచిన క్తియును ఆశ్చర్యమునొందక మానదు.

రదాబాయికి పాపము, బాల్యమునందే వైధవ్య ప్రాప్తించెను. వివాహసమయమందు తక్క ుమెన్నడు వీక్షించని యామెను అనేకులు వైచి వంటపొయ్యివద్దనే కుక్కి ఆమె యున్న ల మంటగలుప యత్నించిరి. కాని రోచనా యామయ పవిత్రమానసమే యామె సచ్చరి మూలకారణమనియు, మనోనైర్మల్యము సుపారుసు అమ్మలఅధిక్షేపములకు లోనై లేని ంబద్ధప్రలాపముల తేమ విలువగల కాలము వ్యర్థ అపేకులకు క్రూరుల మోహాదృష్టులకు గురియై ీవితము మరింత అపవిత్రముగ నొనర్చుకొంటయో, కాక కులకళంకములై, పుట్టినింటిని, మెట్టినింటిని అపకీర్తిపాలుచేసి దేశమాతకు, దుష్ప్రవర్తనలచే మరింత భారమును గల్గించుచున్న పెక్కురు స్త్రీలసంగతి విచారించి, వగచి, యెట్టి అభ్యంతరములు సంభవించినను లెక్కింపక నా యీ తుచ్ఛదేహమును స్త్రీవిద్యకునై బలియొసంగి అవిశ్వాసులై, మూఢులై, అవిద్యాంధకారమునబడి తొట్టుమిట్టాడుచున్న నాసోదరీమణుల నుద్ధరించి నాజీవితమును సార్థకము చేసికొనియెదగాక యని దృఢ నిశ్చయురాలై స్త్రీవిద్యలో ఉన్నతి జెందుచు వచ్చుచున్న పూనానగరమును గూర్చి తానదివరకు వినుచున్నది యగుటంజేసి ఒరుల కీవార్త తెలియజేయకుండ, ఒరులసహాయము నపేక్షింపకుండ తాను అబలనను సంగతియే మరచి ఆవేశమాత్ర సహాయురాలై ప్రోత్సహించుచుండ, తిన్నగ పూనా చేరెను. నాలుగు సంవత్సరము లక్కడనుండి, ఉన్నత విద్య నంది ఆంగ్ల విద్య నభ్యసించి బిరుదములంది తా మపరసరస్వతులని యెంచుచు, విర్రవీగి, కన్నుమిన్ను గానక, పరులతో భాషించినయెడ తమ విద్య కెక్కడ లోపము వచ్చునో యను భయముచే మూర్తీభవించిన గర్వరాసులోయన తిరుగుచుండు మన యీనాటి కొందఱు సోదరీమణులవలె గాక శారదాబాయి యున్నత విద్యతోపాటు వినయ, వివేక, సత్ప్రవర్తనాదులయందు కూడ తనయంతటియామె లేదని పలువురచే గణింపబడి పూనా కళాశాలయందు వన్నెకెక్కి, జన్మభూమి కేతెంచి తన స్వంతధనముతో పాఠశాలాభవనము నొకదాని గొని దానికి శారదాభవనమని పేరిడి, పెక్కురుబాలికల నందుజేర్చి తన ఆశయ మీడేర్చుకొనుచుండెను.

శారదాబాయియొక్క సాంగత్యలాభము వలన లీల గృహకృత్యముల యందేమి అధ్యాపికాత్వము నందు గల నేర్పునందేమి మిక్కిలి నేర్పుగణించి, ఆమెకు తల లోని నాల్కవలె ప్రవర్తించుచు ఆమెకనుసన్నల మెలగుచు తత్ప్రేమ భాజనమై మెలంగుచుండెను. ఒక్క నిమిషము లీల లేకున్న శారదాబాయికి ఈ జగమంతయు నంధకారమయముగ తోచుచుండును. అప్పుడప్పు డామె తన స్థానమున లీలను ఉపాధ్యాయినిగ నొనర్చి బాలికలకు పాఠముల చెప్పించుచు తాను చూచి ఆనందించుచుం

...ను. బాలికలుగూడ లీలను తమసోదరిగ భావించి, ...లు నీరు భంగి ఒక్కటై మెలగుచుందురు. సాంగత్య ...భము వలననే కదా గులాబిచెట్టుక్రిందనున్న మన్ను ...డ పరిమళించుట. అటులే శారదా సాంగత్యము ...న సహజ సద్గుణవతియగు లీల సుగుణశీలయై అన్నిట ...మెకు తోడునీడయై తలిదండ్రుల కీర్తి మరింత వృద్ధి ...చుచు, ఆ గ్రామమందు సర్వజన ప్రేమైకపాత్రినియై ...ప్పుచుండెను.

ప్రాతఃకాలము ఏడుగంటలై యుండవచ్చును. ప్రాతఃకృత్యము తీర్చుకొని శుచియై శారదాబాయి ...లను ముందిడుకొని నిత్యమును వలె తులసీదాస కృతమగు హిందీ రామాయణమును చదువుచుండెను. లీలగూడ ఆమె చదువు పద్యముల నర్థముచేసికొనుచు నత్యంత భక్తా ...లితమానసయై వినుచుండెను. కొంత తడవునకు రామాయణ పఠనము ముగించి, శారదాబాయి లీలతో సంభాషించుచుండెను. ఇట్టితరి పాకశాల పరిచారికయొకర్త చేతనొక యుత్తర మునిడి అమ్మా! తపాల వాడిప్పుడే దీని నాకొసంగెనని చెప్పుచు ఆమెచేతి కందిచ్చెను. ఇట్టి సమయమునందు ఉత్తర మెవరివద్దనుండివచ్చెనో యని యోచించుచు, కవరుచింపి లోని కాగితముతీసి యిట్లు చదువసాగెను.

ప్రియసోదరీ, నమస్కారములు,

ఈ మధ్య వచ్చిన సైమనుకమీషను బహిష్కారణాసరమున నేను పాఠశాలను బహిష్కరించితిని. దాని ఫలితముగ పాఠశాలనుండి వెడలగొట్టబడితిని. వాడు మొదలు మా అన్నచే పలుబాధలకు లోనై వారి కోపానలమున కాహుతి యగుచుంటిని. చదువుమాని, యింటి యందు చేతకాని పిరికిపందవలె కూర్చుండినయెడ, తిండి పెట్టుట తనకు గూడ దుర్భరమగుననియు, యింకను ఏవేవో దుర్భాషలాడి నన్ను కంటకముగ జూచుచుండెను. ఇట్లుండ, మొన్న ఆ గ్రామములో జరిగిన విద్యార్థి స్వచ్ఛంద సేవాదళమునకు నన్ను నాయకునిగ నొనర్చి యుండుటచే నేను అన్నగారి అభిప్రాయములకు వ్యతిరేకముగ, ప్రచారము చేయవలసివచ్చెను. అన్నగారదివిని, ఆగ్రహపరవశులై నా మూలమున తమ యుద్యోగమునకు గూడ భంగముకలుగుననియు, నేను యిల్లు వీడిపోయిన తాను సుఖముగ దినములు గడుపుకొందుననియు చెప్పెను. కాని ఆయన యేమన్నను మౌనవ్రతము దాల్చి యూరకుంటిని. ఇంతలో వదినెగారు వచ్చి నన్ను గాంచి, నాకై జాలినొంది, కఠినోక్తులచే నా మనస్సు నొప్పింపవలదనియు, మిమ్మె దైవముగనెంచి, భావించి పూజించుచు, పితృసమానులుగనెంచి, గౌరవించుచున్న అతని హేయదృష్టిని జూడవలదనియు, మా అన్నగారిని ప్రార్థించెను. అట్టితరి ఆయన ఆమె నానలకు క్రోసివైచి 'నీవా నాకు నీతులు గరపెదానవు? ఆ చెనటి నిన్నుకూడ చెరచుచున్నాడే! మీరే దేశభక్తులు, దేశమునుద్ధరింప అవతరించినారు. కాన, యిద్దరుగూడ నొక్కచోటికిబోయి హాయిగ జీవింపుడని" పలువిధముల నిందించెను. పతివ్రతా శిరోమణియగు యామె మిగుల వగచి, 'భర్తృ సందేహమునకు గురినైతినే' యని మిగుల దుఃఖించెను. ఈసంగతి వినినంతనే నాహృదయమున మిన్నువిరిగి మీద పడినట్లాయెను. 'అయ్యో! నా మేలు నభిలషించుచు నామూలమున, ఒక పతివ్రతయగు నబల భర్తృసుఖమునకు, దూరముగావలసివచ్చెనా! తిండిలేకపోయినను, గుడ్డలేకపోయినను, ఆయమ సుఖముకొరకైనను నేనిల్లు వీడిపోవుట నాకర్తవ్య'మని భావించితిని. అన్నగారి సందేహమునకు గురియై వారికంటికి శూలమువలె మెలగుచుండుట హేయమని యెంచితిని. నాసంగతి నీకు తెలియబరచుట నాకర్తవ్యమని ఎంచి నీకీయుత్తరము వ్రాయ పనుకట్టితిని.

ఇట్లు నీప్రియసోదరుడు,

శ్యామసుందరుడు."

ఈలేఖ గాంచినతోడనే, శారదాబాయి నిశ్చేష్టయై, కొంతవడికి అన్నగారి దౌర్జన్యము, వారిక్రౌర్యము తనకు తమ్మునియందుగల అనురాగముగాంచి, యిట్టితరి అన్నగారిదృష్టికి దూరముగనుంటయే శ్రేష్టమనియు, తానుజీవించియున్న పర్యంతము అతని కెట్టి కష్టము కలుగజాలదనియు, ఉత్తరము గాంచినతోడనే తనవద్దకు రావలసినదనియు, తమ్మునికొకలేఖ వ్రాసెను.

లీలగూడ ఉత్తరముసంగతులను శారదాబాయి నోటి నుండివిని తానుగూడ శ్యామసుందరునికొరకై జాలి నొంది ఆతని యున్నతాశయములకు, ఉదారస్వభావమునకు మనమున మిగుల సంతసించి అట్టి సుగుణములప్రోవ యగు తమ్మునిగలిగియున్న శారదాబాయియొక్క అదృష్టమును, మిక్కిలికొనియాడి ఆతడు వచ్చినతోడనే తాను ఆతనియొద్ద శుశ్రూష చేయుచు దేశచరిత్ర, దేశములోని యిప్పటి పరిస్థితులు, నేర్చుకొనుటకు కృతనిశ్చయరాలై ఆతనిరాకకెదురుచూచు చుండెను.

౨

నాటి ఉదయమునుండియు లీలా శారదలు శ్యామసుందరుని రాకకై నిరీక్షించుచుండిరి. నిమిషమొకయుగమువలె వారికి తోచుచుండెను. ఎన్నిమారులు గడియారమువంక చూచినను ఝామునకొకటము వచ్చుసమయమగుటలేదు. ఆతురులైయున్న సమయమందు అన్నిటను విలంబమే కాన్పించును. అట్టితరి ఎప్పుడు శ్యామసుందరుని గాంతుమా! ఎన్నడు వానితో సంభాషింతుమా యనియున్న మన లీలా శారదలమనములెంత వేగిరపడుచున్నవో వారిఆతురత సూచించు మొగములే చెప్పుచున్నవి.

గడియారము టిక్కుటిక్కుమని పండ్రెండుగంటలు కొట్టెను. గణగణమను శబ్దముతో, ఒకజట్కాబండి శారదాభవనముముందు ఆగెను. శ్యామసుందరుడు లోపలఁడిదిగి ప్రేమదృష్టులతో తన్నుగాంచుచు, తనకెదురుగవచ్చుచున్న అక్కగారికి ప్రణమిల్లి వసారాలో నుండు సోఫాపై కూరుచుండెను. చేత మంచినీరుచెంబు నిడికొని లీల లజ్జాభయము లొక్కమారు, పెనగొన త్రొట్రుపాటొందు అడుగులతో మెల్లగ తలుపుచాటున నుండి శారదాబాయికి అచెంబునందిచ్చెను. "లీలా! రమ్మి, టుగమ్మ సిగ్గేలనమ్మా", యని లీలను పిలిచెను. అపరిచితనామము వినుటతోడనే శ్యామసుందరుడు సుమ్ముమదిక్కు మొగమై, "అక్కా, 'లీలా!' యని యిప్పుడెవరినామము పేర్కొంటివే? ఆమె ఎవరు? మీపాఠశాలా విద్యార్థినియా?" అని యడిగెను; అంత శారదాబాయి "నాయనా! లీల మాతాపితృ విహీనయగు నొకబాలిక. కేవలము పరమాత్ముని సహాయము తక్క వేరొండుసహాయ మామెకులేదు. చూడు! శీలతనము సూచించు ఆమె సుకుమారముఖము గాంచిన ఆమెసద్గుణము లన్నియు కన్నులకట్టిన ట్లుండును. నిరాశచే, శుష్కించి, వాడిపోయిన నాఆనందమునకు దోహదముగావించిన దీ బాలామణియే?" యని పలికెను. అక్కగారుచెప్పిన మాటలన్నియు వినుచున్న శ్యామసుందరుడు లీలపై నొక్కమారు చూచెను. అంతవరకు శ్యామసుందరుని ముఖసౌందర్యముగ్రోలుచు, పిపాసాయుతములైన లీలా దృష్టులు శ్యామసుందరుని దృష్టులలో లీనమైపోయెను. ఆచూపులలో నేమి మాయాజాలమున్నదో కాని కొంతవరకు వారు ఈ బాహ్యప్రపంచమును మరచి తమజీవితమును ఒకరికొకరు ధారవోసినటులు తెల్పుచున్నవో యను దృక్కులతో అట్లే నిలిచిరి. శారదాబాయి ముసిముసినవ్వులతో 'ప్రణయాంకము' ప్రారంభమయ్యె గదాయని లోన తలపోయఁ దొడఁగెను.

శ్యామసుందరుడు ఆగ్రామమున అణగిడినదాదిగ జాతీయసంస్థల నిర్మించి అందు రాట్నములను, మగ్గములను పెట్టించి అనేకులు బీదవారల కుపాధి కల్గింప మొదలిడెను. ఇంతియ కాక, పల్లెటూరి గ్రామముల కేగి దేశపరిస్థితులు, దేశము,దేశదారిద్ర్యమున్న నెట్టిదియో యెరుంగక తమలో తాము తగవులాడుకొనుచు, అన్యోన్యము ఐకమత్యమునువీడి మతకలహములచే తమ్ము తామే నిర్భాగ్యులుగ జేసికొనుచున్న పల్లెలవారిని విద్యావంతులనుగ జేసి, వారలలో ఐకమత్యము గలిగించి రాట్నములయందు, మగ్గములయందు వారికుత్సాహము జనింపజేసి వారి గౌరవమునకు పాత్రుడై, ఒకనిముసమైనను విశ్రమింపక పరులహితముకొరకై పాటుపడ జొచ్చెను.

శ్యామసుందరుని వయస్సుతోపాటు ఆతనిబుద్ధి వికాసము, కీర్తిప్రతిష్ఠలుకూడ వృద్ధినందజొచ్చెను. స్వార్థరహితమగుసేవ, ఫలాపేక్షలేని దేశభక్తి, మనోవాక్కాయకర్మముల నాతడు చేయుచున్న మానససేవ దేశీయహృదయముల నాకర్షింపకుండును. ఆతనిమాటయన్న ఎల్లరును ప్రాణముల నిచ్చుటకైనను సంసిద్ధులగుదురు. ఆతని

# ముఖ్య గమనింపు

గా॥ మిస్టరు. జస్టిస్. వి. రామేశంపంతులు, బి. ఎ., బి. యల్. మద్రాసు హైకోర్టు జడ్జీగారు 11-4-1928 తేదిన నిటులు వ్రాసిరి:—

మద్రాసులో నీటి వరుంబడి తగ్గినప్పుడు, కొళాయినీటిని నియమిత పరిమాణము కంటె నేను తక్కువగా వాడుచున్నప్పటికి, కొళాయి నీటి నుపయోగించుట తగ్గింపవలెననెడి ఉద్దేశముతో ట్యూబ్ భావిని త్రవ్వించి లిమాయి బ్రదర్సు వారి మెయర్సు పంపును ఏర్పాటు చేయించితిని. గత 2 మాసములనుండి సంతృప్తికరముగా పని యొసగ్చుచున్నది. ఎంత చిన్నభావినైనను త్రవ్వించుటకగు ఖరీదుకంటె, గొట్టం భావిని త్రవ్వించి మేయర్సు పంపు నేర్పరుచుట కగు ఖర్చు చాల తక్కువగును.




మీారు చేయవలసిన బెద్దియన మాకు కబురంపించి, మా మెకానిక్ నకు పూర్తి వివరములు తెలియజేయుము. మేము మేయర్సు పంపు నేర్పరచి మీాకు ఎడతెగని మంచినీటి సప్లయి యొసగ్చి మిమ్ములను తృప్తిపరచగలము.

ఇండియాకు సోల్ ఏజెంటు వారివద్దనుండి తెప్పింపుడు.

## లిమాయి బ్రదర్సు లిమిటెడ్

**1/173, బ్రాడ్వే, పోస్టుబాక్సు 202 మద్రాసు.**

సబ్ ఏజంట్లు:— ఫ్రెండ్సు & కంపెని, బెజవాడ.



(౧౮) నూకుశ్రాని బీరువా



(౧౯) అందమైన దంతపు కరండకము



(౨౦) నూకుశ్రాని బీరువా

